UME 58—PART 4
15th February, 1985

# పద్యకావ్యములు

SES

NDIA

month.

A.I.C.W.A.,

ప్రతి 1.

# పీఠిక

శ్రీకంకంటి పాపరాజకృత విష్ణుమాయావిలాస యక్షగానమునకు నేటివఱ కుపలబ్ధమైన వ్రాతప్రతి యొక్కటియే. ఇది తంజావూరు సరస్వతీమహాలు పుస్తక భాండాగారము నందున్నది. (చూ. క్యాటలాగ్: ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణములు. ౧౧. గ్రంథసంఖ్య ౪౯౫, పుటలు ౧౯౩-౧౯౪). ప్రస్తుతముద్రణ మీమాతృకనుజూచి వ్రాసికొనిన రెండు ప్రతులపై నాధారపడి యున్నది. పై బేర్కొనిన సరస్వతీపుస్తక భాండాగారమునుండి నేను వ్రాయించి తెప్పించుకొనిన దొకటి; తెలుగువ్రాయ సలువాటులేని వ్రాయసకాఁడు వ్రాయుటవలన నిందుతప్పు లనేకములు గలవు. ఆంధ్రవిశ్వవిద్యాలయ తెలుగుశాఖవారు వ్రాయించి తెప్పించుకొనియుండిన ప్రతిమఱియొకటి; నాయుపయోగార్థము మిత్రులు శ్రీ. యస్. వి. జోగారావుగారు శ్రీకొమ్మనమంచి జోగయ్యశర్మగారిచే దీనికొక నకలు వ్రాసి యంపిరి. మాతృకయొక్కటియే యైనను నీరెండునకలు లందచట నచట కొన్ని భేదములు గాన్పించుచున్నవి. కాని పరిగణింపఁ దగినవి కావు. అందందు గ్రంథపాతము లున్నను నవి యల్పములు. గ్రంథము నందంతటను తప్పులు మెండుకొని యుండినవి. వీనిని సవరించి సరియైనపాఠమును గుదుర్చుకొనుట సులభసాధ్యము గాక పోయినది. ఈపట్టున చిరమిత్రులు పూజ్యులు శ్రీమానవల్లి

రామకృష్ణకవిగారు నాకమోఘమైన సహాయమొనర్చిరి. వారికిని శ్రీశ్రీలు జోగారావు, జోగయ్యశర్మగారలకును కృతజ్ఞతా పూర్వక వందనములను సమర్పించుచున్నాను.

బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు ముద్రణవిషయమును బ్రస్తావమునకు దెచ్చినవెంటనే యరమరికలేక ముద్రణభారమునువహించి తమ భాషోద్ధారక బిరుదము సార్థకమయినదని స్పష్టమొనర్చిరి. వారికి నా చేమోడ్పులు.

నేలటూరు వేంకటరమణయ్య.

# ఉపోద్ఘాతము

## I

### ౧

ఆంధ్రమున విష్ణుమాయావిలాసము అను పేరుగల గ్రంథములు నాలుగు గలవు. ఇందు రాధామాధవబిరుదాంకిత చింతలపూడి ఎల్లయార్య కృత విష్ణుమాయావిలాసనాటకము ప్రాచీనతమము; కృష్ణరాయల యుగము నకుఁ జెందినది. ఆనాఁడు విరచితమైన రసవత్తరాంధ్రపద్యకావ్యములలో నిదియొకటి. ౧౯౩౩-వ సంవత్సరమున నిది మదరాసు విశ్వవిద్యాలయము వారిచేఁ బ్రకటింపఁబడెను. తరువాత క్రీ. శ. ౧౭-వ శతాబ్దాంతమున రోసనూరి * వెంకటపతి యనుకవి 'విష్ణుమాయావిలాస' మను మూఁడాశ్వాస ముల పద్యకావ్యము నొకదానిని రచించి వెంకటగిరిప్రభువైన బంగారు యాచమనాయని కంకితమొసఁగెను. ఇది వెంకటగిరిమహారాజు వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్రులవారిచే ౧౯౦౦-వ సంవత్సరమున ముద్రింపఁ బడెను.

పైరెండు గ్రంథములు గాక ఉత్తరరామాయణ కృతికర్తయగు కంకంటి పాపరాజు దా నొక విష్ణుమాయావిలాసయక్షగానమును రచించినట్లు ఉత్తర రామాయణపీఠికయందును, ఆశ్వాసాంతగద్యలందును జెప్పుకొనియున్నాఁడు.

"శ్రీ వెలయ మున్ను విష్ణుమాయావిలాస
యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తది యాదిగా మేము నీసుధాను
సారివాక్కులఁ జొక్కియున్నార మనఘ" (౧-౨౭)

---

* నెల్లూరు జిల్లా వెంకటగిరిసంస్థానమునకుఁ జెందిన సగుటూరు సీమయందు దీగ్రామము గలదు. వెంకటపతియో, యాతని పూర్వీకులో సదరు గ్రామవాస్తవ్యులై యుండవలయును.

“విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణం బను మహాకావ్యంబు నందు” ఇత్యాది. (౧-౩౩౪)

ఇది యముద్రితము. “ఈకవియొక్క విష్ణుమాయావిలాసము నేఁడు విష్ణుమాయావిలాసమునకే అంకరమైనది” అని మిత్రులు బ్ర. శ్రీ. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలవారు తాము పరిష్కరించిన యుత్తరరామాయణ పీఠికలో వగచిరి. కాని శాస్త్రిలవారు తలంచినట్లు ఈయక్షగానము నష్టము గాలేదు. తంజాపూరు సరస్వతీమహాలు పుస్తకభాండాగారమున నొక ప్రతి కలదు. (చూ: డిస్క్రిప్టివ్ క్యాటలాగు - ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణలు సంఖ్య ౧౧, పుట ౧౯౩.) ఈ క్యాటలాగును తయారుచేసినవారీగ్రంథమును గూర్చి యిట్లు చెప్పియున్నారు :

“విష్ణుమాయావిలాసము—ఇందు కృష్ణభగవానుని మాయలు వర్ణింపఁబడియె. సంపూర్ణము. వ్రాఁత మంచిది. గ్రంథపాతము లేదు. శైథిల్యము గానరాదు. తప్పులుగలవు.” (పుట ౧౯౩)

ఇందువలన పాపరాజకృత విష్ణుమాయావిలాస యక్షగానము నశించి పోలేదని తెలియుచున్నది. నేటికిని లభ్యపడు ప్రాచీనయక్షగానములయం దిది యొకటి. కవి దొడ్డవాఁడు; నాటకము రసవంతమైయుండు ననుతలంపు సహజమే.

విష్ణుమాయావిలాసమును పాపరాజు యక్షగానముగ రచింపఁగా దానినే గంకంటి నారసింహకవి యాపేరిటి ద్విపదకావ్యము నొకదాని వ్రాసెను. నారసింహకవికృతద్విపద విష్ణుమాయావిలాసము క్రీ. శ ౧౮౭౯ లో మదరాసు నందలి విద్వన్మనోరంజనీ ముద్రాక్షరశాలయందు బ్ర. శ్రీ. పాలపర్తి నాగేశ్వర శాస్త్రులుగారిచే లేఖకప్రమాదాదిజనితదోషంబులు లేకుండునటులు పరిష్కరింపఁబడి ముద్రితమై ప్రచురింపఁబడెను. ఈగ్రంథముగాని, తద్రచయితగాని

యాంధ్రకవుల చరిత్రకారులగు వీరేశలింగంపంతులుగారి దృష్టి కెక్కకపోయి నను, ఆనాఁటి పండితుల కిది కేవల మపరిచితము గాదు. శ్రీ బహుజనపల్లి సీతా రామాచార్యులవారు ద్విపదవిష్ణుమాయావిలాసమును జక్కఁగ నెఱుఁగుదురు. శబ్దరత్నాకరమునం దీగ్రంథము నుదాహరించుటయేకాక తన్నిఘంటుపీఠిక యందు కంకంటి నారసింహకవిని పేర్కొనియున్నారు. అముద్రిత గ్రంథ చింతామణ్యధిపతులగు పూండ్ల రామకృష్ణయ్యగారును నెఱుఁగుదురు. వారీ గ్రంథము నొకా నొక సందర్భమున నుదాహరించి యున్నారు.

౨

ఇంతవఱకు ఆంధ్రవిష్ణుమాయావిలాసముల విచారము. ఇఁకమీఁద ద్విపద విష్ణుమాయావిలాసమునకు సంబంధించిన చర్చ. మొదట నీగ్రంథ కర్త చరిత్రము గనుఁగొనవలసియున్నది. స్వవిరచిత ద్విపద ప్రబంధమునఁ గంకంటి నారసింహకవి యిట్లు చెప్పికొనియున్నాఁడు :

"ఆర్వేల వంశాబ్ధిహరిణలాంఛనుఁడు, గర్వితరిపుమంత్రిగర్వభంజనుఁడు
గురుతర శ్రీవత్సగోత్రపావనుఁడు, పరిలబ్ధ మదనగోపాలభావనుఁడు
ప్రపితామహుని వల్లభప్రభుఁ బోలి, యెప్పుడు బంధులఁ బ్రోచు హితకీర్తిశాలి
యగణితమతిధాత యై తమతాత, యగు నయ్యనునిఁ బోలు నఖిలైకదాత
కంకంటి యప్పయామాత్యగ్రణికుమారుండు, పంకజాక్షపద ప్రభావిహారుండు
మాయన్న నరసమాంబాగర్భశుక్తి, జాయతమౌక్తికంబగు శుభవ్యక్తి
నరవర్ణ్యు వేంకటనరసింహుఁగన్న, సరసుండు పాపరాజప్రధానుండు."

పై ద్విపదలవల్ల ద్విపదవిష్ణుమాయావిలాస గ్రంథకర్తయగు నారసింహకవి విష్ణుమాయావిలాసయక్షగానో త్తరరామాయణ రచయితయగు కంకంటి పాపరాజునకుఁ దమ్ముఁ డని తెలియవచ్చుచున్నది. నారసింహకవి చెప్పిన స్వవంశచరిత్ర సరియైన దని కంకంటి పాపరాజకృతగ్రంథములు రుజువుసేయుచున్నవి. పాపరాజు విష్ణుమాయావిలాస యక్షగానమున స్వవం శము నిట్లు ప్రశంసించియున్నాఁడు :

"వరుస మీముత్తాత వల్లభామాత్యుండు
కృతకృత్యుఁడై మించెఁ గృష్ణుఁ గొలిచి
ఘనుఁడు మీతాత అయ్యనమంత్రి మదనగో
పాలమంత్రోపాస్తి ప్రతిభఁ జెందెఁ
కరుణాబ్ధి మీతండ్రి కంకంటి అప్పయ్య
ప్రభుఁడు తాదృశకీర్తి బాగుమీఱె
శ్రీవత్సగోత్రవారిధి కౌస్తుభమురీతి
వారికంటెను నీవు మీఱినావు
నరసమాగర్భజలధి రత్నంబు నీదు
తమ్ముఁడగు నారసింహు చిత్తంబు నిదియొ
భక్తిఁ గృతియిమ్ము మదనగోపాలునకును
సద్గుణనివాస పాపరాజప్రధాన !" *

ఈ విషయమునే యుత్తరరామాయణ గ్రంథావతారికయం దిట్లు చెప్పియున్నాఁడు:

"విమతగర్వాపహారు లార్వేలవారు, అట్టియార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రారవిందహేళి, మహితగుణశాలి వల్లభామాత్యమౌళి.
శ్రీవల్లభుండు లక్ష్మీ, దేవిని మును పెండ్లియైన తెఱఁగున దనకున్
దేవేరిగ లక్ష్మాంబిక, నావల్లభమంత్రి పెండ్లియాడెన్ వేడ్కన్.
ఆలక్ష్మమాంబయం దా, వల్లభనామప్రధానవర్యుఁడు గనియెన్
పల్లవబాణాకారున్, హల్లకహితకీర్తిహారు నయ్యనధీరున్.
అయ్యనవద్యగుణావని, యయ్యనమంత్రిమణి నరసమాంబ వివాహం
బయ్యె నహార్యమమారిని, నెయ్యంబునఁ బెండ్లియైన నెలతాల్పురహిన్.

* తంజావూరి సరస్వతీమహాలు లైబ్రరీలోని తెలుఁగు వ్రాఁతపుస్తకములపట్టీ (ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణములు సంఖ్య ౧౪, పుట ౧౯౩.)

ఆనరసమాంబగర్భాం, భోనిధి నమృతాంశుచందమున దానయశో
నూనవిభావిభవైకని, ధానంబగు నప్పయప్రధానుఁడు వొడమెన్.
జనసుతుఁ డయ్యప్పనఘునుఁ, డనఘుఁడు బిదురూరి నరసయకుఁ దిమ్మమకున్
దనుజామణియై గుణములఁ, బెనుపొందెడి నరసమాంబ బెండిలియయ్యెన్.
అన్నరసమాంబయందు స, మున్నతగుణుఁ డప్పనార్యముఖ్యుఁడు గనియెన్
సన్నుతుని బాపరాజా, ఖ్యు న్నరసింహాభిధానుఁ గులము వెలయఁగన్.”

(౧: ౨౭-౪౦.)

పైనుదాహరించిన గ్రంథములయందు వర్ణింపఁబడిన కంకంటివారి వంశ పరంపర ఇది :—




3

## కవియొక్క సమకాలికులు

నారసింహకవి దన సమకాలికులగు ఆంధ్రకవుల నిద్దఱిని పేర్కొని యున్నాఁడు. వీరియందు మొదటివాఁడు ఇతని యన్నయగు పాపరాజు. రెండవవాఁడు పుష్పగిరి తిమ్మన.

"అనఘుని పుష్పగిర్యప్పన్న తనయుఁ, ఘను సంస్కృతాంధ్రైకకవనాతిదక్షుఁ,
మా యన్న సఖుని తిమ్మనకవిఁ గృతిసహాయునిఁ బిలిపించి యమ్మేటితోడ."

పుష్పగిరి తిమ్మన కృతిసహాయుఁడఁట. అనగా ద్విపద విష్ణుమాయా విలాసరచనయం దతఁడు కంకంటి నారసింహరాజునకుఁ దోడ్పడె నని దీని భావము. ఇతఁడు పాపరాజునకుఁ గూడ నుత్తరరామాయణ రచనయందుఁ దోడ్పడినట్లు ఉత్తరరామాయణములోని "అనిఁ గిరీటికి శౌరి తోడైన యటులు" (౧-౨౬) అను పద్యమువల్లఁ దెల్లమగుచున్నది. విష్ణుమాయావిలాసయక్షగాన రచనయందుఁ గూడ నతనికి గొంత సంబంధ ముండినట్లు తలఁచుట కవకాశము కలదు. దీని కాధారము విష్ణుమాయావిలాస యక్షగానములోని యీ క్రింది వచనము :

"విష్ణుమాయావిలాసం బను యక్షగానంబు రచియింప నాకృతికి నేవేల్పు నధిపతిఁ జేయుదు నని తలంచుచున్నంత మదీయకార్యఘటనాభిముఖులైన కవి తిమ్మనార్య ప్రముఖు లేమని నుతింపుచున్నారు." *

ఈ వచనమునఁ బేర్కొనఁబడిన కవి తిమ్మనార్యుఁడు పుష్పగిరి తిమ్మనార్యుఁడే కాని యన్యుఁడు గాఁడు. ఇతఁడు కంకంటి సోదరుల కిరువురకును గ్రంథరచనకుఁ దోడ్పడుట చిత్రము. ఈ తోడ్పాటు విష్ణుమాయావిలాసయక్షగానముతో ప్రారంభమాయెను. ఉత్తరరామాయణరచనయందు క్షీరనీరన్యాయమున పాపరాజుకవనముతోఁ గలసి దానికి వన్నె దెచ్చినది. పాపరాజు మరణానంతరము గ్రంథరచనకుఁ గడఁగినయతని తమ్ముని కవితకు రూపొసఁగినది. నారసింహరాజు ద్విపదవిష్ణుమాయావిలాసమును దప్ప నన్యగ్రంథములను రచించినట్లు చెప్పుకొనలేదు. మఱియుఁ బాపరాజు జీవదశయం దుండఁగా నీతఁడు గ్రంథరచనఁ దలపెట్టలేదు. తా రచించిన ద్విపదకావ్యము నెవ్వని కంకితము సేయుదునా యని చింతించుచుండఁగా బాప

---

* తంజావూరు సరస్వతీమహాలు లైబ్రరీయాంధ్రాముద్రితగ్రంథముల పట్టిక, పుట ౧౯౩.

రాజు స్వప్నమున సాక్షాత్కరించి శ్రీరామచంద్రుని కంకితము సేయుమని చెప్పెనఁట.

"అతులనకా విష్ణుమాయానాటకంబు, వితతవాగ్వైఖరి ద్విపదగావించి
యీవిశ్వహితకృతి కేవేల్పు నధిపు, గావింతు నని యాత్మ గణియించునపుడు.
దురితసరోరుహతుహినభానుండు, సరసుండు పాపరాజప్రధానుండు
నాకలోకొక్క-నాఁడు గాన్పించి, యేకతంబునఁ గూర్మి నెసఁగ నిట్లనియె.
నాకూర్మిసోదర నరసింహ నీవు, చేకొని ద్విపదగాఁ జేసినయట్టి
అనుపమవిష్ణుమాయానాటకమున, కనురూపవిభుఁ డెవ్వఁ డని తలంచెదవు
దానికి విభుఁడు సీతామనోహరుఁడె, కాని తదన్యుండు గలఁడె లోకమున."

కావున కంకంటి నారసింహకవి ద్విపదవిష్ణుమాయావిలాసము రచించు నప్పటికి అతని యన్నయగు పాపరాజు స్వర్గస్థుఁ డాయె ననుట నిశ్చయము. పుష్పగిరితిమ్మనార్యుఁడు దన సహాధ్యాయుఁడు పాపరాజుయొక్క మరణానంతరముగూడ నాతనియందలి వాత్సల్యముచేతనో, మఱి యేకారణముచేతనో అతనితమ్ముఁడు గ్రంథరచనకుఁ గడఁగఁగా నతనికిఁ 'కృతిసహాయుఁడై' తోడ్పడెను. ఈసందర్భమున గమనింపఁదగిన యంశమొకటి కలదు. "పుష్పగిరి తిమ్మనార్యుఁడు కంకంటిపాపరాజు వ్రాసినట్టు ఉత్తరరామాయణమొకటియు, కంకంటి నారసింహరాజుఁ వ్రాసినట్టు విష్ణుమాయావిలాసద్విపదకావ్య మొకటియు రచించినాఁ"డను నైతిహ్యము కలదని బహుజనపల్లి సీతారామాచార్యులవారు తెలిపియున్నారు. † ఉత్తరరామాయణ కర్తృత్వమును గూర్చి యభిప్రాయభేదములు గలవు. కావ్యరచనయందుఁ బుష్పగిరి తిమ్మన కంకంటి పాపరాజునకుఁ గొంతతోడ్పడియుండినను, వీరిరువురి కవిత్వమునకును భేదమున్నందున, ఈలోకప్రవాదము సరియైనదిగా నుండదని వీరేశలింగం పంతులుగారు నుడివిరి. ‡ "తిమ్మకవి సమీరకుమారవిజయమైలికిని, దీని శైలి

† శబ్దరత్నాకరము, పీఠిక, పుట ౧౬.

‡ ఆంధ్రకవులచరిత్రము, పుట ౪౫౯.

కెని, పదప్రయోగాదులకును ప్రాక్పశ్చిమముల యంతరముకల"దని పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులవారు వక్కాణించిరి.* ఈవిషయమై కొంత పరిశోధనసాగించిన మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పైవారితో నేకీభవించక "కవితాశైలినిబట్టి చూడ నుత్తరరామాయణమునందు ఆదిశ్రీకారము నుండి యంత్యాక్షరమువఱకును బదగుంఫనమున నేమి, సమాసజాటిల్యమున నేమి, నేర్పుకూర్పువలన నేమి, యూహాపోహాల నేమి, పద్యముల యెత్తుగడల నేమి, యతిప్రాసప్రయోగముల నేమి పుష్పగిరి తిమ్మన్నయే సమీరకుమార విజయము వ్రాసినతరువాత వ్రాసినట్లుగాఁ దోఁపకపోదు." "రెండు గ్రంథములను సవిమర్శముగా సాంతముచూచినచో నొక్క ముఖమునుండి వెలువడిన వాక్కులగనే కన్పట్టకపోదు. అతిద్రాఘిష్ఠంబులగు సమాసములును, వచనంబులును, అచ్చతెనుఁగుకూర్పులును, లోకోక్తులును, అర్థాంతరన్యాసముక్తపద గ్రస్తాదులును రెండింటను గలవు. మొత్తముపైని సమీరకుమారవిజయము కంటె నుత్తర రామాయణములో మెఱుఁగుపెట్టఁబడిన దని చెప్పకతప్పదు. పైని గనపఱచిన యేకదేశసామ్యమునుబట్టియే కాదు. సాంగముగాఁ దిలకించిన చోఁ దిమ్మకవియే సమీరకుమారవిజయమును రచియించిన తరువాతఁ గంకంటి పాపరాజునకు సాహాయ్యమొనరించు పేరిటనేమి, ఋణమీఁగుటకొఱకేమి యుత్తరరామాయణమును రచించె నని చెప్పుట కనువుగనున్న" దని చెప్పిరి. § ఇట్లు విమర్శకపండితులు ఉత్తరరామాయణకర్తృత్వమును గూర్చి రెండుతెగలై చీలుటచేత, నిశ్చయమును నిర్ణయించి చెప్పుట సులభసాధ్యము గాదు.

ఇఁక ద్విపదవిష్ణుమాయావిలాసనాటకముగూడ పుష్పగిరి తిమ్మనయే కంకంటి నారసింహరాజు పేరిట రచించెనేమో విచారించవలసియున్నది. ఈ సందర్భమునఁ జింతనీయములైన యంశములు మూఁడు గలవు: ౧. నారసింహరాజు దన యన్న మరణానంతరము గ్రంథరచనకుఁ గడంగుట.

---

* ఆనందముద్రాక్షరశాలవారి యుత్తరరామాయణపీఠిక, పుట ౨.

§ వావిళ్లవారి సమీరకుమారవిజయ పీఠిక, పుటలు ౧౦, ౧౫.

౨. ఇతఁడు దన యన్న పాపరాజును బోలి 'చతుర్విధానవద్య కవిత్వ విద్యావధానాధునాతన భోజరాజ,' 'విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణ ప్రవీణైతాదృశ బిరుదావళివల్ల స్వకవితానైపుణ్యమును దెల్పుకొనక, కేవలము 'సరసవిద్వత్కవిజనశరణ్యుండ'నని చెప్పుకొనుట. ३. పుష్పగిరి తిమ్మన కృతిసహాయుఁ డగుట. ఈ విషయముల నన్నిటిని సమాలోచనముచేసి చూడ పుష్పగిరి తిమ్మనకు విష్ణుమాయావిలాసరచనయందుఁగూడ కొంతయేని సంబంధము గలదని తోఁచుచున్నది. భావిపరిశోధకుల పరిశ్రమవల్ల దీనియందలి నిజము వెలువడవలసియున్నది.

## ౪

## కవికాలము

నారసింహరాజు కంకంటి పాపరాజుతమ్ముఁ డనియుఁ, బుష్పగిరితిమ్మనార్యునికి సమకాలికుఁడనియు పైన వ్రాసినదానివల్ల వ్యక్తపడుచున్నది. కాని వీ రేకాలమువా రైనదియుఁ దెలిసికొనుటకుఁ దగినయాధారము లెవ్వియుఁ వీరి గ్రంథములలోఁ గానరావు. కవిత్వశయ్యయు, శబ్దజాలమును జూడ వీరు ౧౭-వ శతాబ్దమువారు కావచ్చు నను నూహ పొడముచున్నది. వీరికాలమును నిర్ణయించఁ దగు నాధారములు లేకున్నను, ఆంధ్రకవులచరిత్రకారులు వీరు ౧౮-వ శతాబ్దాంతముననుండిరని వ్రాసియున్నారు. "కంకంటిపాపరాజు ప్రళయకావేరిపట్టణములో నమీనుగా లౌక్యాధికారమునం దుండినవాఁడు. ఆకాలమునందే పుష్పగిరితిమ్మన్న కొంత ఋణముచేసి యాయప్పు తీర్పలేక యీపుస్తకము (ఉత్తరరామాయణము)ను దాని క్రిందఁ జేసి యియ్యఁగా ౧౭౯౦-వ సంవత్సరప్రాంతమున నుత్తరరామాయణమును పాపరాజు తన పేరితోఁ బ్రచురించెనని చెప్పుచున్నారు. కవి యిప్పటికి (ఆంధ్రకవుల చరిత్ర తృతీయభాగ రచనాకాలమునాఁటికి) నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు." "కంకంటివారి యుత్తరరామాయణమువలెనే (ధరణిదేవుల

రామమంత్రికృత) దశావతారచరిత్రమును పుష్పగిరితిమ్మన్నచే రచియింపఁబడిన దని కొందఱు చెప్పుచున్నారు గాని కవులిద్దఱు నేకకాలములో నొక్క దేశములో నుండుటదక్క వారి మాట కాధారలేశమును గానరాదు'' * ఇందువల్ల కంకంటి పాపరాజును, పుష్పగిరి తిమ్మనార్యుఁడును, ధరణిదేవుల రామమంత్రియు సమకాలికు లనియును, వీ రందఱు క్రీ. శ. ౧౭౯౦-వ సంవత్సర ప్రాంతమువారనియు నాంధ్రకవుల చరిత్రకారుల యభిప్రాయమని తెల్లమగుచున్నది. కాని ధరణిదేవుల రామమంత్రి కంకంటి పాపరాజునకును, బుష్పగిరి తిమ్మన్నకును సమకాలీనుఁ డని రుజువుసేయఁగల సాక్ష్య మెందును గానరాదు. ఒకవేళ సమకాలీనుఁ డని తాత్కాలికముగ నంగీకరించినను ధరణిదేవుల రామమంత్రి ౧౮-వ శతాబ్దాంతమువాఁడుగాఁడు. అతఁడు క్రీ. శ. ౧౭-వ శతాబ్దోత్తరార్ధమున నుండె ననుటకుఁ బ్రబలమైన సాక్ష్యమతని గ్రంథముననే కానవచ్చుచున్నది. దశావతారచరిత్రకృతిపతియగు మగదల కృష్ణామాత్యుని ముగ్గురు పెదతండ్రులలో జ్యేష్ఠుఁడగు తిమ్మన "వీరవేంకటపతిరాయవిభువతంస-భావితోభయచామరభద్రదంతి-దంత పల్యంకికాది సన్మానఘనుఁ"డని తెలియవచ్చుచున్నది. † ఈ వీర వెంకటపతిరాయలు క్రీ. శ. ౧౬౩౦ మొదలు ౧౬౪౨ వఱకును వేలూరు నిజరాజధానిగ కర్ణాటక సామ్రాజ్యమును పాలించెను. ఇతఁడు తన పూర్వికులగు విజయనగరచక్రవర్తులవలె నాంధ్రభాషాభిమానియై యాంధ్రకవులఁ బోషించెను. వెంకటపతిరాయదండకమున కితఁడే నాయకుఁడు. చంపూరామాయణకృతికర్తయగు ఋగ్వేదివెంకటాచలపతికవియొక్క తండ్రియగు తిరువెంగళార్యకవిని 'గొలకులాయపుఁదేజిబలుకౌ'తని సత్కరించెను. ‡ పెరియన్నయను కవివర్యునిచే మీనకేతనాభ్యుదయమను నొక యాంధ్రప్రబంధమును గృతినందెను. ఇట్టి భాషా

* ఆంధ్రకవులచరిత్ర, పుట ౪౬౪.

† వావిళ్ల వారి దశావతార చరిత్ర, ౧-౩౫.

‡ ఆంధ్రవాఙ్మయపరిషత్తువారి చంపూరామాయణము. ౧-౩౧.

పోషకునిచే మన్ననవడసిన మగదల తిమ్మన యతని సమకాలికుఁడని చెప్పక తప్పదు. మఱియు నీతిమ్మనార్యుని కడగొట్టుతమ్ముఁడును, మగదలకృష్ణుని పిన తండ్రియగు నారణపుత్రుఁడైన ఆదినారాయణుఁడు 'నవాబుసాహెబువితీర్ణ సువర్ణజాంబూనదాంబరాసనగ్రామబహుమానభాసమానవ్యవిభుఁ'డఁట. *
ఇందుఁ జేర్కొనఁబడిన నవాబుసాహెబు సయ్యద్ మహమ్మదు మీర్ జుమ్లా. ఇతఁడు మొదట క్రీ. శ. ౧౬౩౯-వ సంవత్సరములో కర్ణాటకముపై నెత్తివచ్చి పులికాటు అనఁబడు ప్రళయకావేరిపట్టణమును ముట్టడించెను. కాని వెనుదిరిగి పోవలసివచ్చెను. క్రీ. శ. ౧౬౪౯లో రెండవపర్యాయము దాడివెట్టి తూర్పు సముద్రతీరభూముల నాక్రమించుకొని ప్రళయకావేరికధిపతులైన యొలందా వారి నదిమి కప్పముగొనెను. కావున మగదల కృష్ణుఁడును, ధరణిదేవుల రామమంత్రియు క్రీ.శ. ౧౬౫౦-వ సంవత్సరప్రాంతమువారనుట నిశ్చయము.

ధరణిదేవుల రామమంత్రి క్రీ. శ. ౧౭-వ శతాబ్దమధ్యమున నుండె నని పైనుదాహరించిన యాధారములమూలమున స్పష్టపడినది. కంకంటి పాపరాజును, పుష్పగిరి తిమ్మనార్యుఁడును రామమంత్రికి సమకాలమువారగుట నిశ్చయమేని, వారును నప్పటివా రనియే చెప్పవలయును. పాపరాజుతమ్ముఁడును, గ్రంథరచనయందుఁ బుష్పగిరితిమ్మనార్యుని సాయమునందిన కంకంటి నారసింహరాజును వీరివలెనే క్రీ. శ. ౧౭-వ శతాబ్దమధ్యమున వర్ధిల్లె ననుటకు సంశయింపఁ బనిలేదుకదా.

౫

## విష్ణుమాయావిలాసముల యన్యోన్యసంబంధము

ఈవ్యాసారంభమునఁ జేర్కొనఁబడిన విష్ణుమాయావిలాసముల కన్యోన్య సంబంధ మెద్దియేని కలదేమో విచారించవలసియున్నది. వీని కన్నిటికిని నామ మొక్కటియే సామాన్యమా, లేక ఇతివృత్తమునందుఁగూడ సంబంధము గలదా

---

* వావిళ్లవారి దశావతారచరిత్ర, ౧-౫౮.

యను విషయములు విమర్శనీయములు. కాని ఈ కార్యమును సాగించుట కిప్పుడు సామగ్రి చాలదు. పైనాలుగు విష్ణుమాయావిలాసములలోను మూఁడు ముద్రితములైనను రోసనూరి వెంకటపతికృతగ్రంథ మిప్పు డెచ్చటను లభ్యము గాకయున్నది. పాపరాజవిరచిత యక్షగాన మింకను నముద్రితము. కాని విష్ణుమాయావిలాసముల కన్నిటికిని నామసామాన్యతయే కాక ఇతివృత్త సాదృశ్యమునుగల దనుటకుఁ గొంత యవకాశ మున్నది. రోసనూరి వెంకటపతికృత విష్ణుమాయావిలాసమునుండి వీరేశలింగంపంతులుగారి యాంధ్రకవుల చరిత్రలో నీక్రిందిపద్య ముదాహరింపఁబడి యున్నది.*

"ఇటువలెనేమి యాపయన మిప్పుడు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుఁ డంచనెదు పల్కులు సిద్ధము సుందరీక్రియా
కుటిలశిరోజియైన హరి గొబ్బునఁ జూచితిరేని మీకు నో
క్కటఁ జపలత్వమైనతఱి గౌరవ మెట్లగునో తలంపుఁడీ."

ఇది శివగర్వభంగకథయందలిది. దీనిని యెల్లనార్యుని విష్ణుమాయావిలాసనాటకములోని ఈ క్రిందిపద్యములతోఁ బోల్చి చూడుఁడు:

"దేవరవు మిక్కిలియుఁ గాం, తావిభవశాత్రుఁడవు మనసుస్థైర్యము చలనం
బై వచ్చెనేని మఱితువు, భావింపఁగ సర్వభూప్రపంచము నెల్లన్.
"జగములు మూఁడు నాతని వశంబున నున్నవి మాయఁ జిక్కి ధీ
జగతి ప్రధానదైత్యసురసంయములుం గమలాసనుండు నా
దిగఁ గలవారలెల్ల వికృతిం బడుచుంద్రు తదీయలీలనే
మగునోసుమీ మహాత్మ జలజాక్షునిచేత భవత్ప్రతాపముల్. (౪: ౧౫-౬)

ఈ యంశమును గంకంటి నారసింహారా జిట్లు వర్ణించియున్నాఁడు:

"మఱఁదును బగవాఁడు మటుమాయలాఁడు
హరి మీర లాతని యాఁడురూపంబు

---

* ఆంధ్రకవులచరిత్రము, పుట ౩౭౫.

చవ్వ సేయకఁ గన్న జగములం దోవ
నవ్వగు దవ్వగు నా దేహము పెంపు
జగములన్నియుఁ దద్వశమున వర్తిలెడు
జగతి ప్రధానులౌ సంయమీశ్వరులు
కమలాసనాదులౌ ఘనుని మాయలను
భ్రమఁగొనియున్నారు ప్రాజ్ఞతలుడిగి.”

దీనిఁ జూడఁగా రోసనూరివెంకటపతి యెల్లనార్యుఁడు చెప్పిన కథలనే తన గ్రంథమునందు వర్ణించెనేమో యను శంక గలుగుచున్నది.

విష్ణుమాయావిలాసయక్షగానమునందలి యితివృత్తమేమో తెలియదు ఎల్లనార్యుని బోలి పాపరాజును దన గ్రంథమును మదనగోపాలున కంకిత మొసంగియుండుటచేత నితఁ డెల్లనార్యుని గ్రంథమునే యక్షగానముగ మార్చి యుండవచ్చును. కాని పాపరాజవిరచిత యక్షగానప్రబంధము వెలువడు వఱకును వాస్తవస్థితి యిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు.

ఇది యెట్లున్నను నారసింహకవికృత ద్విపదప్రబంధము నెడ ఇట్టి సంశయమున కవకాశము లేదు. ఇది యెల్లనార్యుని గ్రంథమునకుఁ బ్రతిచ్ఛాయ. ద్విపదవిష్ణుమాయావిలాసము పూర్వోత్తరము లను ద్విభాగములుగ విభజింపఁబడియున్నను బద్యకావ్యమువలె నిదియుం నైదాశ్వాసముల గ్రంథమే. పద్యకావ్యమునందువలె నిందును కథాప్రణాళిక శుకయోగివాగ్ఝరియందియే వెలువడుచున్నది. రెంటను ఉపకథకుఁడు గోవిందశర్మయే; కథానుక్రమణికయు నొక్కటియే; కథలును అవియే. పద్యద్విపద విష్ణుమాయావిలాసనాటకముల యన్యోన్యసాదృశ్య మింతటితో ముగియలేదు. నారసింహకవి సాధ్యమైనంత వఱకు యెల్లనార్యుని మాటలను, వర్ణనలను, లోకోక్తులను దన ద్విపదలయం దిమిడ్చెను. పద్యవిష్ణుమాయావిలాసనాటక పరిష్కర్తలీ ద్విపదకావ్యమును *జదివి ముద్రితగ్రంథములో దొరలియుండు నపాఠములను సులభముగ దిద్దుకొని

యుండవచ్చును. *పద్యద్విపద కావ్యముల యన్యోన్య సన్నిహితసంబంధమును తెల్పుటకై రెండుమూఁడు ఉదాహరణముల నిచ్చి ఈవ్యాసమును జాలించెదను.

లక్ష్మీగర్వభంగకథలోని కొలనివర్ణన—పద్యకావ్యము :

"కనుగొనియె నగ్రవీథిన్, వనజాలయు యొక్క దివ్యవనజాకరమున్
దనుపునెడి వాడబారిన, వనరుహకల్హారకైరవంబులతోడన్.
నిండారఁ జిగిరించి నిగనిగల్ చాలక వాడిన నవపల్లవములతోడఁ
గలయంగఁ బూచి తేనెలు చిందు నెత్తావిఁ బొరయకఁగందిన విరులతోడఁ
బరిపాకమునఁ బండి సరసమాధురి లేక పవ నింకిపోయిన పండ్లతోడఁ
†మలయుఁటల్లాని కొమ్మలవిన్ననై యున్న యలిపోతశుకపికావలులతోడఁ
చిన్నవోయిన వనము వీక్షించి లక్ష్మి
యనుఁగుజెలులకుఁ జూపుచు నరిదిపడుచు
నెన్నఁడును జూడ మిటువంటి హేమవనము
శూన్యమైయున్నదిది యేమిచోద్య మొకొ" (౭-౨౩, ౨౮)

---

* తార్క్ష్యణకై యొక్క అపపాఠము నిచటఁ జూపుచున్నాను సముద్రమథనమువల్లఁ బుట్టిన విశేషములు వర్ణించుసందర్భమున—

'కల్పపాదప పించకము నప్సరస్త్రీలు, కామధేనువును జింతామణియును'

అను సీసపాదము గలదు. 'పించక'శబ్దము కలదేమో విచారణీయము. కలిగినను సందర్భోచితముగాదు. ద్విపదయం దిట్లున్నది :

"మఱియు దేవాసురుల్ మసలకయ్యుదధిఁ, దరవఁగాఁ గల్పకతరుపంచకంబు"

'పించకము' అపపాఠము. 'పంచకమే' సరియైనపాఠము. 'పంచైతే దేవతరవః' అని నామలింగాను శాసనము.

† ముద్రితప్రతి, 'మెలకువల్ మాని' అని. దీనికి వ్రాఁతప్రతులోని పాఠాంతరము 'మలయు...కొమ్మల విన్ననైయున్న' అని ఉద్ఘోజ్ఞాపికయందుఁ దెల్పఁబడియున్నది. ద్విపదవిష్ణుమాయా నాటకమున 'మలయుంటల్లాని' అని యున్నది. 'మలయుఁటల్లాని' అనఁగా, 'సంచార ముడిగి'యని యర్థము.

ద్విపదకావ్యము (పుట ౩౪):

"వనజాకరముఁ జూచి వాడుకల్హార, వనకుహకైరవావళిగలదాని
నిండారఁ జిగురించి నిగనిగ్గనక, దండిమానిన వాడు తలిరులతోడఁ
గలయఁబూచి మరందగంధము ల్లేక, తేఁటివిగ్గికొనకఁ గందినపూలతోడఁ
బరిపాకమునఁ బండి పద నింకి తీపు, నెఱియక స్రుక్కియుండెడి పండ్లతోడఁ
మలయుటల్మాని కొమ్మల విన్ననైన, యలికులశుకకోకిలాదులతోడఁ
జిన్నవోయిన వనిఁ గొంత నీక్షించి, యన్నలబోఁడి లో నాశ్చర్యమంది
ననబోఁడులార యెన్నఁడు నిట్టి హేమ,వనము గన్గొన మింతవన్నెఁ జెందియును
నేల వాడినదొకో యీతోఁట యనుచు, నాళీజనాళితో ననుచు నద్దివ్య
కమనీయవనమెల్లఁ గలయ దర్శించి,......... ..........."

బ్రహ్మాగర్వభంగకథ యందలి మాయాసరస్వతి మదనవికారవర్ణన:

పద్యకావ్యము.

"వెండియుఁ దనకుండా నే సంకల్పదశావిశేషంబున—
కన్నీరునించు తొంగలిరెప్ప లల్లాడ, నొకమాటు ప్రియుఁడు రాకునికిఁ జేసి
కంపించు నొకమాఱు కోఁదీఁగె చెమరింప, భర్త కౌఁగిటఁ జేర్పఁ బట్టె ననుచు
నవ్వులఁ దేలు నానన మొప్ప నొకమాఱు, పతితోడ భావించు భావరతికిఁ
బులకించు నొకమాఱు వలపుచన్నుల క్రేవ,లదర వల్లభులీల నాత్మ గోరి
యంగజుఁడు వెల్లిగొల్పంగ నంగకముల, నెల్లకళజాఱ* ధైర్యంబు పల్లటిల్లి
బ్రహ్మదేవునిపైఁ బ్రేమఁ బాఱవిడిచి, వీణియను మీటి పాడుచు విద్రుమోష్ఠి"
(౩: ౩౦౧)

ద్విపదకావ్యము (పుట ౭౦):

"వెండియు నొకకొన్ని వెడమాయ లూని, నిండువేడుకల నన్నీరేజగంధి
కన్నీరు నించు తొంగలిరెప్ప లార్చు,మన్నించు పతి రాక మసలె నేఁ డనుచుఁ

---

* 'కళలూర' అను ద్విపదకావ్య పాఠమే యుత్తమ మని తలఁచెదను.

గంపించు నొకమాటు కౌఁదీఁగె చెమ్మరింపఁ గౌఁగిటను జేరిచె నాథుఁ డనుచుఁ
నవ్వులఁ జెల్చు నానన మొక్కమాటు, మవ్వంపుముచ్చట ల్మగఁ డాడె ననుచుఁ
బులకించు నొకమాటు భూరి మోహామునఁ, జెలువుని చెలువంబుఁ జింతించుకొనుచుఁ
గళలూర ధైర్యవైఖరి కడ తేరఁ, గలఁగు నొక్కొకమాటు కాయజుం డెంచ
నీరీతి వీణ వాయించుచు బ్రహ్మఁ, బ్రేరేచుకొనుచు నబ్బిత్తరియున్న."

నారసింహారా జిల్లా పద్యవిష్ణుమాయావిలాసనాటకమును మేలుబంతిగఁ గొన్నను దత్కర్తయగు నెల్లనార్యు నెచ్చటను బేర్కొనకపోవుట చిత్రము.*

# II

## కవికాలనిర్ణయము.

ఉపోద్ఘాత ప్రథమభాగమునందు రోసపూరు వెంకటపతియను కవి యొకడు విష్ణుమాయావిలాస మను పద్యప్రబంధమును రచియించి వెంకటగిరి ప్రభువైన బంగారుయాచమనాయని కంకితము జేసెనని చెప్పియున్నాను. ఈ కవినిగూర్చియు వానిని నాదరించి యాశ్రయ మొసగిన ప్రభువునుగూర్చియు వీరేశలింగముపంతులవా రిట్లు వ్రాసియున్నారు.

'కృతినాయకుడైన బంగరుయాచమనాయఁడు ఔరంగజేబు ఢిల్లీ చక్రవర్తిగా ౧౬౯౬-వ సంవత్సరమునందు నున్న కాలములో వెల్లూరి నవాబగు జుల్ఫగారుచేఁ జంపఁబడినందున నీ పుస్తకము ౧౬౯౦ ప్రాంతములందు రచియింపబడినదని చెప్పవచ్చును' అని.

వీరేశలింగంపంతులుగారు చేసిన కవికాలనిర్ణయము సరియైనది కాదు. రోసనూరు వెంకటపతి విష్ణుమాయావిలాసము నంకితమిచ్చినది జుల్ఫకర్ ఖానునిచేఁ జంపఁబడిన బంగరుయాచమనాయనికి గాదు. అతని మనుమఁడైన బంగరుయాచమనాయనికి. ఈ విషయము వెంకటపతికృత విష్ణుమాయావిలాస పద్యప్రబంధపీఠికలోని,

---

* చిత్రభాను - ఆషాఢభారతియందిది మొదట ప్రకటింపఁబడెను.

పే బంగరేచభూమీశ్వరపతి వీరమాత సుపౌత్రుఁడీ మహినుతింప
నే కుమారేచభూమీంద్రుని పట్టంపు గోమలి కమ్మక్కకును సుపుత్రుఁ
డే బంగరేచమహీమండలాధ్యక్షుఁ డభినవవిష్ణుమాయావిలాస

సత్కృతికి నాథుఁ డాతని సన్నుతింపఁ
దగిన నాదైనభాగ్య మెంతని వచింతు
ననుచు మదిలోన సంతోష మగ్గలింప
నెఱసి మఱియును దృఢబుద్ధి నివ్వటిలఁగ.

ఈపద్యమున వివరింపఁబడిన కృతిపతియొక్క వంశానుక్రమణిక నిట్లు వ్రాయనగును—

బంగరేచభూమిపతి=భార్య, వీరమాత
|
కుమారేచభూమీశుఁడు=భార్య, అమ్మక్క
|
బంగరేచ మహీమండలాధ్యక్షుఁడు
అభినవవిష్ణుమాయావిలాసమునకుఁ గృతిపతి

సదరు విష్ణుమాయావిలాస కృతిపతియగు బంగరేచమనాయకుఁడు శా.శ. ౧౬౪౪ ప్లవంగ (క్రీ. శ. ౧౭౨౨) సంవత్సరమున జననమందెను; శా. శ. ౧౬౭౭ (క్రీ. శ. ౧౭౫౫) భావసంవత్సరములోఁ బట్టాభిషిక్తుఁడాయెను; శా. శ. ౧౬౯౯ (క్రీ. శ. ౧౭౭౭) సంవత్సరమున మృతినందెను. ఇతనికి విష్ణుమాయావిలాసమంకితమొసఁగిన రోసనూరి వేంకటపతియు నప్పటివాఁడేయని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఇచట స్మరింపదగినవిషయ మింకొకటి కలదు. ఈ రోసనూరి వేంకటపతి తన్ను గృతిపతి తండ్రియైన కుమారేచమనాయకుఁడు "తిక్కయజ్వయముచుక్ జాలంగఁ జేరిచ్చి ప్రోచె" నని చెప్పుకొనియున్నాఁడు. అనఁగా నితఁ డాకుమారేచమ నాయని యాస్థానమందె కవియై వర్ధిలి యతనిచే సత్కరింపఁబడెననుట తెల్లము. ఈ కుమారేచమనాయకుఁడు శా. శ. ౧౬౧౨ (క్రీ. శ. ౧౬౯౦) లో జన్మించి, శా. శ. ౧౬౧౭

(క్రీ. శ. ౧౬౯౫)లో పట్టాభిషిక్తుఁడై, శా. శ. ౧౬౭౦ (క్రీ. శ. ౧౭౪౮)లోఁ బరమపదము నందెను. కావున రోసనూరి వేంకటపతి క్రీ. శ. ౧౭౦౦-౧౭౬౦ లమధ్య జీవించియుండెనని చెప్పుట యొప్పగును.

ఇంతదూర మిచట నీ రోసనూరి వేంకటపతినిగూర్చి యేల ప్రస్తాపించవలసి వచ్చినదనఁగా నతఁడు కంటిపాపరాజకృత విష్ణుమాయావిలాస యక్షగానమును పద్యప్రబంధముగామార్చి బంగరు యాచమనాయకుని కంకితముగావించెను. ఇతివృత్తమును గథా సన్నివేశములును రెంటియందును నొక్కతీరుగనే యున్నవి; కాని తత్కారణమున పాపరాజకృత యక్షగానమునె వెంకటపతి పద్యకావ్యముగ విరచించెననుట సరికాదు; పాపరాజు యెల్లనార్యకృత విష్ణుమాయావిలాసనాటకములోని మోహినికథను ఇంచుకయేనియు మార్పక కైకొనియున్నాడు. వెంకటపతియు నట్లె యెల్లనార్యకృతగ్రంథమునె యనుసరించియుండవచ్చును. పాపరాజకృతయక్షగానమునకును వెంకటపతి విరచిత పద్యప్రబంధమునకును నితివృత్తమందును గథాసన్నివేశములందును గానవచ్చు పోలిక లాకారణమున గల్గియుండవచ్చును. కాని ఇతివృత్త కథాసన్నివేశములపోలికలుమాత్రమే కావు ఈపట్టున వితర్కింపదగినవి. పాపరాజకృత గేయములను గొంచెపాటి మార్పులతో వెంకటపతిపద్యములుగ జేసియున్నాఁడు. ఈ క్రిందియుదాహరణము లీ విషయమును దెల్లముసేయఁగలవు.

పాపరాజు :—

కినుకరదనములు కిటుగిట గీటువారు
మొగమెత్తఁబొఱ బొమ ముడివెట్టువారు
శివుని నిందింప వచ్చితె యనెడివారు
ఎటుల నీశ్వరుమహిమ లెఱుఁగు ననువారు
ఇచట నికని ప్రతిష్ఠ లేమనెడివారు.

వెంకటపతి :—

గిటగిట పండ్లుగీటుచును గ్రిక్కిరియన్ మును చుట్టుముట్టియున్
బెటబెటలైన పల్కులను భీషణభంగులఁబ్రేలియుగ్రునిన్

దటవటలాడెనే యెదురు తన్ను నెఱుంగక పోవైనీకుఁ డై ప్రఘట్ట......
ప్పటివలె వేగమే గదిసిపట్టుఁడు బాసకటారిబాహుఁడు......
హరునిక్ నింద యొనర్పవచ్చితివె నీ యాఖ్యాతముల్ మాన కీ
శ్వరుమాహాత్మ్య మెఱుంగనేర విటనిల్వక్ వద్దులేలెమ్ము యి
త్తరినీవట్టి ప్రతిష్ఠలక్ నిలుపు చా ల్తబ్బిబ్బులం చిట్టు లం
దఱు గుంపుల్ గొని యా సురర్షి బహుబాధల్ పెట్టగాఁ దొట్టినక్.

పాషరాజు :—

అలతినవ్వు మొగంబునను జెలువారగాను శంభుఁడు
పలికెఁబదిరూపములుదాల్చిన ప్రభువుతోడక్
పంకజోదర నీవు స్త్రీరూపంబుదాల్చి మోహము
లంకురింపఁగ జేసితట దేవాసురులకు.

తెమలకావిధమెల్ల సురముని తెల్పినాడు మాచి
త్తమునకచ్చెరుపాటు సంతోషము ఘటిల్లక్
సొలపుగల నీ యాడురూపము చూడగోరివచ్చితి
సొలపకప్పటిరూపు గ్రమ్మరఁ జూపుమిపుడు.

నన్ను ధిక్కరించినాడు నారదుండు నాతిరీతి
నున్ననిన్నుగన్న భ్రమసి నన్నునిన్ను మరతు ననుచు
నావిరక్తివైభవంబు నీ విశేషమాయజగము
లీ విరించిముఖులు దెలియ నింతివగుము వింతయేల!

మురునిసంహరించి మిత్తి మద మణంచియున్న నన్ను
మరులు పరుపవశమె నీకు మాయదారివగుచు రమ్ము.

వెంకటపతి :—

శంకరుఁడభీషు ఖుఁడై యా, పంకజనేత్రు నకు మృదులపద్ధతి నను ని
శ్శంకుఁడగు నారదుఁడునను, గొంకక నిందించె నిండుకొలువున నిన్నన్.

దానవకోట్లభ్రమింపఁగ మానినివై నట్టినీదు మతకరిమాయల్
నేను గనినంత మరులను బూనుచుఁ బ్రాకృతినిలీలబుద్ధి చలింపన్.
నా వైరాగ్యం బతనికి నీ విశ్వంబునకుఁ దెలుప నెంచినమతితో
నేవచ్చితి నిటకు స్నీ స్త్రీవిధమరయఁగ నిపుడు సిద్ధము గాగన్.

మరునిజయించి మృత్యువు ప్రమత్తవిధం బుడిగించి లోకభీ
కర గరళంబు మ్రింగి మురఘస్మర నీ వెరుగంగ బ్రసిద్ధి నే
బరగిన నన్నొకం డనుట పాడియె కామిని గమ్ము వేగ మే
గురుకొనితళ్కు నీకులుకు గుబ్బలు నిక్కఁగఁ జూచి మెచ్చెదన్.

పాపరాజు :—

శైవుఁడొక్కఁడు బారఁజూచి మోహిని యనుచుఁ
గావరంబున నొకనిఁ గౌఁగిటను జేర్చెఁ
జడలువీడఁగ మహేశ్వరు సేవకుం డొకఁడు
ఎడతెగక శివమెత్తి శివమాడఁ దొడఁగెఁ
బ్రమథుఁ డొక్కఁడు తమకపడి లేచి చెలియనుచు
భ్రమసికంబము పైడిప్రతిమముద్దాడెఁ
ఒక వీరమాహేశుఁ డొద్ది శిష్యునిఁ జేరి
సకియేనొ యని వాని జడలు పట్టీడ్చెఁ
ప్రమదమున నొక రుద్రభటుఁడు తనకుంచెయ్యని
గమకించి యొకని గడ్డముఁబట్టి తీసెన్.

వెంకటపతి :—

ప్రమథుఁ డొక్కం డొక్క ప్రమథుఁ దదాఖ్యఁగాఁ
భావించి గడ్డంబు పట్టితివియు
భ్రమఁగొని యొక రుద్రభటుఁ డొక్క శివదూతఁ
గాంతగాఁ గనుఁగొని కౌఁగలించు
మఱియొక్క శైవుఁ డుమామహేశ్వరు సేవ
కుని బడంతిగ నెంచి పెనఁగఁబోవు

భవుభృత్యుఁడొక్కండు పసిడికంబపుబొమ్మఁ
గొమ్మని ముద్దాడుఁ గోర్కె మెఱయ

ఇట్టివి యింకను పెక్కుగలవు. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట నుదాహరింప లేదు. పైని యుదాహరణములలో గడపటిదానియందు గమనింపదగిన విశేష మొక్కటికలదు. అందు వర్ణింపఁబడిన ప్రమథుల చేష్టలు యెల్లనార్య నారసింహ రాజుల విష్ణుమాయావిలాసములలో బీజప్రాయముగ గన్పట్టుచున్నవి.

'ప్రమథు లన్యోన్యపరిరంభ బద్ధులైరి, వికలితేంద్రియులై పెడవిల్తుచేత' అని యెల్లనార్యుఁడును,

'పాయకయన్యోన్యపరిరంభణములు
సేయుచుఁ బ్రమథులు చీకాకుపడిరి'

అని నారసింహరాజును సంగ్రహముగఁ జెప్పివిడచినారు. పాపరాజు దానిని విపులీకరించి మనోహరముగ వర్ణించినాడు. వెంకటపతి పాపరాజు వర్ణన నట్లె కబళించినాడు. అంతటితో దృప్తినందక పాపరాజుయొక్క యక్ష గానమందలిపద్యములను గొన్నిఁటి నలఁతిమార్పులతోను గొన్నింటిని యథాతథ ముగను దన పద్యకావ్యములో జేర్చుకొన్నాడు.

పాపరాజు :—

ఇటువలె బెక్కురీతులఁరహిం గని య వ్వని జాఱుపైఁటతోఁ
జిటిపొటి చెమ్మటల్ దొలఁకు చెక్కులతో నెలదేఁటి రంతుతో
నటునిటు నోరమోమిడు నొయారముతో నొక పొన్నగున్నచెం
గట మయిసేద దీర్చుకొను కాంత గనుంగొని శంభుఁ డుబ్బుచున్.

ఈ పద్యము వెంకటపతి విష్ణుమాయావిలాసము మూఁడవయాశ్వాసమున గానవచ్చుచున్నది.

ఇటువలెఁ జెక్కురీతు లలరారఁగ నవ్వని జాఱుపైఁటతోఁ
జిటిపొటిచెమ్మటల్ దొలఁకు చెక్కులతో నెలదేఁటిరంతుచే

నటు నిటు నోరమోమిడు వయారముతో నొక పొన్నగున్న చెం
గట మయినేద దేర్చుకొను కాంతగనుంగొని శంభుఁ డుబ్బుచున్.

మఱియుఁ, బై నూశ్వాసముననే, పాపరాజుపద్యములు మఱికొన్ని గన్పట్టు చున్నవి.

హేరాళంబుగ బాళి తాళకొనలే కేనెంతో చింతింపఁగాఁ
జేరం బిల్వవు గారవింపవు దయంజేపట్ట వింతేనటే
నేరంబెంచి మరుండు నన్నొదవఁగా నీకెంతసంతోష మో
యీరారాపులు మాని యేలుకొనవే యేమే జగన్మోహినీ

ఇది యథాతథముగ వేంకటపతిచే గ్రహింపబడెను.

సోలుచు సరోజములఁ దూలుచు పరాగముల
రాలుచు రథాంగివలె వ్రాలుచును హాళిక్
గ్రోలుచు మరందముల బోలుచు మిళిందముల
వ్రేలుచు దరీలతల దూలుచును గేళిక్
దేలుచు జలేభముల గూలుచు మృణాళములఁ
జీలుచు మరాళములఁ దోలుచును బాళిక్
దాళుచు ఖగార్భటిని నేలుచు కొలంకు దయ
మాలుచు తొగ న్నెలఁగఁ బోలుచుఁ జెలంగెన్.

ఈ లయాగ్రహిని వేంకటపతి యీక్రిందివిధమున తారుమారుచేసి తనకావ్యమునఁ జేర్చుకొన్నాఁడు.

సోలుచు సరోజముల దూలుచు పరాగముల
రాలుచు రథాంగివలె వ్రాలుచును గేళిక్
దేలుచు మృణాళములఁ జీలుచు మరాళములఁ
దోలుచు దరిక్ లతల వ్రేలుచును బాళిక్
వ్రేలుచు ఖగార్భటులఁ దాళుచు మిళిందముల
దోలుచు మరందములగ్రోలుచును హాళిక్
గ్రాలుచు కొలంకుఁ బొరిమాలుచు జలేభమునఁ
జాలుచు సుధారుచుల నేలుచుఁ జెలంగెన్.

మఱియుం

అనుచు లేచుచుఁ బొదలుచు హా! యటంచు
నట్టె బయ లాలకింపుచు...............
యని భ్రమసి బయలు కౌఁగిట నానుకొనుచు
నువిద లేకున్న నడలొందు చుండె నపుడు.

అను ద్వితీయపాదమున గ్రంథపాతముగల పాపరాజుగారి గీతపద్యము, వేంకటపతి ప్రబంధమునందు యించుకంత భేదముతో సంపూర్ణముగఁ గలదు.

అనుచు లేచుచుఁ బొదలుచు హా! యటంచు
నట్టె బయలాలకింపుచు నదిగొ కాంత
యనుచు భ్రమగొని కౌఁగిట నదిమికొనుచు
నువిద లేకున్న నడలుచు నుండె నపుడు.

మఱియు,

అడుగులు దొట్రిలంగ నిటు లంగన కౌఁగిట నుంచుకొన్న య
ప్పుడె తనువెల్లఁ జెమ్మరిల బోరున జాఱిన శుక్లమేఘులై
మడుగులు కాల్వలై ధరణిమండలిసోకినచోటులెల్లఁ ద
త్తడియును వెండియై తగ నతండును గాంచెను పారవశ్యమున్.

అను పాపరాజుపద్యముయొక్క ప్రథమపాదమునుమార్చి తక్కిన మూఁడుపాదముల నట్టె సంగ్రహించినాడు వేంకటపతి.

కడువడినంగనన్ బిగువుకౌఁగిట బిగ్గగఁ జేర్చుకొన్న య
ప్పుడె తనువెల్ల ఝుమ్మురన బోరన బాఱిన శుక్లమేఘులై
మడుగులుకాల్వలై ధరణిమండలిసోకినచోటులెల్లఁ ద
త్తడియును వెండియై తగె నతండును గాంచెను బారవశ్యమున్.

ఇందు ద్వితీయపాఠమందలి 'ఝుమ్మురు' అనునది ధ్వన్యనుకరణశబ్దము. ఒకవేళ పరమేశ్వరుని శుక్లమేఘులై పాఱినప్పుడట్టి ధ్వనిపుట్టెనని యనుకొందమన్నను, 'తనువెల్ల' యనుమాట కన్వయము గుదురదు. శుక్లము పరమేశ్వరుని దేహమంతటను బాఱియుండదదు కదా. శుక్లము పాఱినపుడు దేహమున స్వేదముపుట్టుట సహజము. 'తనువెల్లఁ జెమ్మరిల' అని పాపరాజు చెప్పినది సరి.

సందర్భశుద్ధిని గమనింపక వేంకటపతి 'చెమ్మగిల' యనుదానిని 'ఝుమ్మురన' అని మార్చినాడు.

తిక్కయజ్వయని పొగడ్తనందిన ప్రౌఢకవి వేంకటపతి పాపరాజు పద్యముల నేల సంగ్రహించుకొనవలసివచ్చెనో! కాని యీ వితర్కమున కిది తరుణముగాదు; పాపరాజుపద్యములను సంగ్రహించుటవలన యతఁడు దనకంటె బూర్వుఁడని రుజువుచేసినాడు వేంకటపతి. వాఙ్మయచరిత్రకారు లందుకై యతనికి గృతజ్ఞతచూపవలసియున్నది.

వేంకటపతి క్రీ. శ. ౧౭౦౦-౧౭౫౦ లమధ్య వర్ధిలెనని ముందు చెప్పియున్నాఁడను; అతఁడు చూఱగొన్నవిష్ణుమాయావిలాస యక్షగాన కర్త యగు పాపరాజు అంతకంటె బూర్వుఁడైయుండవలెను. ఎంత పూర్వుడో? కనుగొనుటకు సాధ్యపడునేమో చూతము. ఇటీవల, శ్రీ యస్. వి. జోగా రావుగారు పాపరాజుయొక్క కాలనిర్ణయము సేయఁ బూనుకొని రెండు ముఖ్యాంశములను దెల్పినారు. ద్విపదభాగవతకర్తయైన తేకుమళ్ల రంగశాయి తన కావ్యగ్రంథరచనమందు పుష్పగిరి తిమ్మన సహాయుఁడని చెప్పినాఁడు. ఈ పుష్పగిరితిమ్మన కంకంటి పాపరాజునకును, నతని తమ్ముఁడైన నారసింహరాజునకు గూడ గ్రంథరచనాసహాయ్యుఁడని యీ యుపోద్ఘాతపూర్వభాగమున జెప్పియున్నాఁడను. కావున వీరందఱును సమకాలికు లనుట తెల్లము. మఱియు ముందు పేర్కొనిన తేకుమళ్ల రంగశాయి,

'రామాయణంబు భారతమును ద్విపదలై మీఱంగ జేసిన యీ రంగనాథు,
ధీరు బట్టేపాటి తిరుమలభట్టుగారి ప్రౌఢోక్తులుగలుగ స్మరించి'

యని రంగనాథుని బట్టేపాటి తిరుమలభట్టును స్మరించియున్నాడు. ఈ బట్టేపాటి తిరుమలభట్టే ద్విపదభారతరచయితలలోఁ బ్రముఖుఁడైన తిమ్మకవి. అతఁడు దనచే రచింపఁబడిన విరాటపర్వమును జంగాలముమ్మయ కంకిత మొసఁగెను; ముమ్మయయల్లుఁడైన పాలమూరి కృష్ణభూపతికి దెనాలిరామకృష్ణుని మనుమడైన రామభద్రకవి స్వవిరచిత ఇందుమతీపరిణయము నంకితమిచ్చెను. రామభద్రకవి దనకావ్యమును క్రీ. శ. ౧౫౭౫ ప్రాంతమున రచియించి యుండును; కావున దక్క్ష్ములిపతియైన పాలచూరి కృష్ణవిభుఁడును నతని మామగారైన జంగాల ముమ్మయయు నజనికి విరాటపర్వము నంకితముజేసిన

తిమ్మ (బట్టేపాటి తిరుమలభట్టు) కవియు నప్పటివారలే కావలెను. "ఆ బట్టేపాటి తిమ్మకవిని పేర్కొనిన రంగశాయి కవియు నతనికి సమకాలికుడో యర్వాచీనుడో కావలయును. అర్వాచీనుడన్నను తగవులేదు; కాని సమకాలికుడనుటయే సమంజసమేమో యనిపించుచున్నది. కారణము రంగశాయి ఆ పేర్కొనుటలో 'గా' రనుశబ్దము ప్రయోగించుట. సమకాలికులయెడనే అట్టిమర్యాదను పాటించుట వరిపాటి. అదియును రంగశాయియు బట్టేపాటి తిమ్మకవియు నిద్దరును నెల్లూరుమండలమువారు. రంగశాయి సమకాలికులని రూఢిరైన పుష్పగిరి తిమ్మకవియు, కంకంటి పాపరాజుకూడ నెల్లూరుమండల కవులే. నలుగు రొకరిగురించియొక రెఱిగియేయుందురు.' కావున కంకంటి పాపరాజు క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమువాడు కావలయును. *

ఈవాదము సత్తలేనిది రంగశాయి బట్టేపాటి తిరుమలభట్టును పేర్కొనునప్పుడు 'గా'రని చెప్పినంతమాత్రమున వారిరువురును సమకాలికులనుట సరికాదు. పూర్వికులయెడను గా శబ్దమును వాడవచ్చును. అట్లు వాడిన వారును గలరు. బట్టేపాటి తిమ్మన, తేకుమళ్లరంగశాయి, పుష్పగిరి తిమ్మన, కంకంటి పాపరాజు ఈ నలుగురును నెల్లూరుమండలకవులగుట తథ్యమే. తత్కారణమున వారేకకాలమువారని చెప్పుట సమంజసముగాదు.

శ్రీ జోగారావుగారు తెల్పిన రెండవ యంశము బలవత్తరమైనది. అది యిది: "మదరాసుప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున కంకంటి పాపరాజు నుత్తరరామాయణప్రతులు చాలగలవు. అందు డి. నం. 9 తాళపత్రప్రతి యతి శిథిలమై ప్రాచీనముగ గన్పట్టును. దానిచివర ప్రజోత్పత్తినామసంవత్సర పుష్య బహుళ ఏకాదశిలు వఱకు మునగాల తిరువెంగలయ్య వ్రాసిన ఉత్తర రామాయణము సంపూర్ణము' అని కలదు. ఇది శ్రీ స్వామికణ్ణుపిళ్లైగారి ఇండియన్ ఎఫీమెరిస్ ప్రకారం క్రీ. శ. 1832-వ సంవత్సరం జనవరి 29వ తేదికి సరిపోయినది. శకసంవత్సరసంఖ్య చెప్పబడినప్పుడుకూడా క్రీస్తుశకపు తేది నిర్ణయించుటకు సంవత్సరమాసపక్షతిథులతోపాటు విధిగా వారమైన చెప్పబడినచే అది పొసగును. మన సంవత్సర షష్టి

* ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము, (ఆదివారము, ఆగస్టు 7 వ తేది 1955) పుట. 5.

చక్రము మరలమరలనావృతమగుచునే యుండును. అమాసము లాపక్షము లాతిథులే యథాపూర్వము సంభవించును. వానితో పాటు వారనిర్దేశమైనచో అవియన్నియు గుదిరిన తేదీ మరలమరల సంభవించుట కాదాచిత్కము. కాని కేవల మసంభవమని తలంపరాదు! ఒకొక్కప్పుడు మూడు నాలు గావృతులకే యది సంభవింపవచ్చును. కాని ప్రస్తుతసందర్భమున క్రీ. శ. 1632 తరువాత నేటివరకు మరలనట్టిది తటస్థింపలేదు.

ఇదివాస్తవము - చూడుఁడు:

1. శా. శ. ౧౬౯౨ ప్రజోత్పత్తి పుష్యబహుళ ఏకాదశీలు, సోమవారము ఘటికలు ౩౨ పలములు ౧౨=(క్రీ. శ. ౧౭౭౧ మార్చి ౫-వ తేది శుక్రవారము )
2. శా. శ. ౧౬౩౩ ప్రజోత్పత్తి పుష్యబహుళ ఏకాదశీలు, శుక్రవారము ౩౧ఘటికలు ౩౬ పలములు=(౧౭౧౧ ఫిబ్రవరి౧౦-వ తేదిశుక్రవారం.)
3. శా. శ. ౧౬౭౪ ప్రజోత్పత్తి పుష్యబహుళ ఏకాదశీలు మంగళవారము=(క్రీ. శ. ౧౭౫౩ జనవరి ౩౦-వ తేది మంగళవారము.)
4. శా. శ. ౧౫౧౩ ప్రజోత్పత్తి పుష్యబహుళ ఏకాదశీలు సోమవారము=(క్రీ. శ. ౧౫౯౨ జనవరి ౪-వ తేది సోమవారము.)
5. శా. శ. ౧౫౫౩ ప్రజోత్పత్తి పుష్యబహుళ ఏకాదశీలు మంద(శని) వారము=(క్రీ. శ. ౧౬౩౨ జనవరి ౬-వ తేది శనివారము).

కావున శ్రీ జో గారావుగారు చెప్పినట్లు అది యాతాళపత్రప్రతిని మనగాల తిరువెంగలయ్య వ్రాసిముగించిన దినమని చెప్పవచ్చును. ఇందువల్ల కంకంటి పాపరాజు క్రీ. ౧౬౩౨ కు ముందు వర్థిలెననియు యుత్తరరామాయణ మప్పటికె వాసికెక్కి జనాదరమును బడసియుండెననియు దేలుచున్నది. అంతకుముం దెప్పు డాతఁడు వర్థిలెనో నిశ్చయించి చెప్పుటకు సాధ్యపడదు: కాని కవితాఫక్కికను శబ్దజాలమును బట్టిచూడ కంకంటిపాపరాజుగారి యుత్తరరామాయణము క్రీ. శ. ౧౬-వ శతాబ్దపు టుత్తరార్థమున అనఁగా క్రీ. శ. ౧౫౫౦-౧౬౦౦ మధ్యరచియింపఁ బడియుండునని తోఁచుచున్నది.

---

*ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము (ఆదివారము, ఆగస్టు 7-వ తేది, 1955) పుట.

శ్రీ ర స్తు.

# విష్ణుమాయావిలాసము



ఉ. శ్రీలలితాంగి నిత్యము ధరించు నురంబున లోకరూఢిగా;
నేలదు నన్నొకప్పు డిది యేటి ప్రియంబన, నిన్ను నాత్మ నే
వేళ వహించు టీ వెఱుఁగవే యని రాధను గారవించు గో
పాలకశేఖరుం డురు కృపావిభవమ్మున మమ్ముఁ బ్రోవుతన్.

వ. అని తరవ(?)సందర్భలీలాధురంధరుండగు కవి పురందరుండు వెండియుఁ బరమకృపాళుం డగు మదనగోపాలుని ప్రశంసతోఁగూడ శంకరపంకరుహాగర్భుల నేమని కొనియాడుచున్నాఁడు.

త్రిపుట:—

దరము చూపెడు కేలు కాకో
దరము నేపెడు డాలు భక్తుల
దరముఁ బాపెడు వాలుఁ బూనిన
హరిఁ దలంతున్. 1

తటిని ముంచినశిరము శ్రీకుచ (?)
తటిని డించిన కరము జగమిం
తటిని మించిన భరముగల ధూ
ర్జటిని గొలుతున్. 2

శ్రుతుల వెలసినపేరు నలుగవ
శ్రుతుల సొలసిన తీరు జపవి
శ్రుతులు గలసిన యూాపగల శత
ధృతినిఁ గొలుతున్. 3

వ. అని కవీశ్వరుండు భక్తియుక్తుండై శక్తిత్రయంబు నేమని కొనియాడుచున్నాఁడు.

జంపె:—

భవము సఫలముగ వై
భవము లొసఁగుము పరా
భవము సేయకమని విభావజుని జనని. 1
వరముగా ధరణి నిలువరముగాఁ జేయు కృతి
వరముగా నడిగెదను వనజభవురాణి. 2
తానవబలోన్నతి సుతానవప్రేమ చి
త్తానవర్తిలు మాకు దయసేయు గౌరి. 3

వ. అని కవినాయకుఁ డాదిమకవుల నేమని కొనియాడు చున్నాఁడు.

జంపె:—

కరిముఖుఁడు కులిశకర్కశదంతముల నతుల
గురు విఘ్నశైలముల గోరాడు గాక. 1
శ్రీరామభటుఁడు సంజీవరాయుం డాయు
రారోగ్యములను మమ్మలరించుఁ గాక. 2

రామాయణంబు భారతము నిర్మించిన మ
హా మహాలకరుణ నాయందెసఁగుఁ గాక. 3

తా మెఱుంగనిదెల్ల తప్పులని నిందించు
పామరుల కిచట వాగ్బంధమౌఁ గాక. 4

క. అని యిష్టదేవతల ప్రా
ర్థనతో సత్కవులఁ బొగడి తప్పొప్పు లెఱుం
గని కాకవిఁ గాదని నే
ననుపమ పదబంధమగు సమంచితభక్తిన్.

వ. విష్ణుమాయావిలాసంబను యక్షగానంబు రచియింప నా కృతికి నేవేల్పు నధిపతింజేయుదునని తలంచుచున్నంత మ దీయ హితకార్యఘటనాదిముఖులైన కవితిమ్మనార్యప్రముఖు లేమని వినుతించుచున్నారు.

సీ. వరుస మీముత్తాత వల్లభామాత్యుండు
కృతకృత్యుఁడై మించెఁ గృష్ణుఁ గొలిచి
ఘనుఁడు మీతాత యయ్యనమంత్రి మదనగో,
పాలమంత్రోపాస్తిఁ బ్రతిభఁ జెందెఁ
గరుణాబ్ధి మీతండ్రి కంకంటి యప్పయ్య
ప్రభుఁడు తాద్రుశకీర్తి బొగుమీఱె
శ్రీవత్సగోత్రవారిధి కౌస్తుభము రీతి
వారికం జెను నీవు మీఱినావు

గీ. నరసమాగర్భజలధిరత్నంబు నీదు
తమ్ముఁడగు నారసింహాలు చిత్తంబు నిదియొ

భక్తిం గృతియిమ్ము మదనగోపాలునకును
సద్గుణనిధాన పాపరాజప్రధాన.

వ. అని పలికి హితవి (ద్వ) త్కవిజనంబుల పలుకులు విని నే సంతోషించిన విధం బెటువలెను.

జంపె:—

అతులమగు విష్ణుమాయావిలాసంబె యట
కృతి మదనగోపాలకృష్ణుఁడఁట విభుఁడు. 1

కలిగె నెవ్వరికిఁ గలుగనిభాగ్యమయ్యారె!
తొలఁగె నాకలుషములు చెలఁగె మత్కులము. 2

......మదనగోపాలునకుఁ గృతియయ్యె
ఫలియించె నాకవిత ప్రఖ్యాతిగాంచెన్. 3

వ. అని సంతోషించి యద్దేవుని ప్రసన్నభావంబు వాంఛించి ప్రస్తుతించెనట యెటువలెను.

ఆది:—

భువనభరణ ధౌరేయా బుధగేయా
భవ కమలభవ ప్రణుతివిధేయా.
హరిహయ నీలశరీరా యతిశూరా
నరసురవందిత నందకుమారా.
స్వామి, మదనగోపాలా జయశీలా
కామితదాయక కాంచనచేలా.

వ. అని స్తుతియించి అద్దేవునకు షష్ఠ్యంతములు రచియించెనట యెటువలెను.

జంపె:—

శరణార్థిపాలునకు సత్యవాచాలునకు
గురుశీలునకు మదనగోపాలునకును. 1

సలలితకృపాళునకు స్వర్ణచేలునకు గో
కులపాలునకు మదనగోపాలునకును. 2

వ. అంకితంబుగా (నాయొనర్పంబూనిన) విష్ణుమాయావిలాసంబు
నకుఁ గథాక్రమ మెట్టులనిన.

గీ. లలితమగు విష్ణుమాయావిలాసకథలు
శ్రీశుకబ్రహ్మచేఁ బరీక్షిన్నృపాలుఁ
డాలకింపుచు డంబనారాయణ ప్ర
సంగమే తేర నద్భుత స్వాంతుఁడగుచు.

వ. శ్రీశుకయోగీంద్రునితోఁ బరీక్షిన్నరేంద్రుఁ డే మనుచు
న్నాఁడు.

జంపె:—

అనఘాత్మ కపటనారాయణ విలాసములు
వినఁగ వినఁగా మదికి వేడ్కలు జనించెన్. 1

భువనమోహనుఁడైన పురుషోత్తముని మాయ
నువిదగా జగము భ్రమయుట సహజమయ్యెన్. 2

సామజాసురహరుఁడు సర్వజ్ఞుఁడాయెఁగా
నేమిటికి తా భ్రమసె నెఱిఁగింపవయ్య. 3

వ. అనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ డేమనుచున్నాఁడు.

త్రిపుట:—

భ్రమయకుండఁగవశమె యెంతప్ర
భావశాలికినైన మాయా
ప్రమదయై చరియించు విష్ణుని
ప్రౌఢిగనినన్. 1
మగతనంబుననుండి జగముల
మరులుగొల్పెడు వన్నె కానికి
మగువతనమున భ్రమలుపెట్టుట
మఱియు నరుదా? 2
నలువనేర్పున సృజనచేసిన
చెలువలకు బుధులెల్ల భ్రమయఁగ
నలువతండ్రియె చెలువయైతే వలచుటెంత. 3

ఏకతాళి:—

వెలయును వేడుక లొలయును సుకృతము
పొలియును పాతకములు హరికథలన్. 1
విను హరియును హరుడును లీలకు భ్రమ
గొని (నది భ్రమియించి)చినదియు నధిపా. 2
చెవులకుఁ జవులుగఁ జెప్పెదమోహిని
యవతారము తెలగని శుకులనియెన్. 3

ఝంపె:—

విలసితోద్యానగము వినుతజనసురనగము
కలిపవనపన్నగము కైలాసనగము. 1
తటచారి సింధురము ధవళరుచిబంధురము
కటకజితమందరము కైలాసధరము. 2

అలకాపురాన్వితము హరభక్తసేవితము
లలితయశోవతము కైలాసపర్వతము. 3

వ. మఱియు నాపర్వత మెట్టులనెను.

త్రిపుట:—

శిరమునను సింధూరరుచిదగఁ
జెలఁగు వేలుపు మస్తుటేనుఁగు
కరణి నగ్గిరి తుదలగైరిక కాంతివెలయున్. 1
శారదాంభోధరపరంపర
సందుసందులఁదోచునగము
దారి నగ్గిరిమీఁదశృంగారవనముల్. 2
వెండియును బైఁడియును బడఁబడు
విధము దెలుపుచు నుండు నపుడ
కొండమణిదీపికలు చంపక కుసుమములును. 3

జంపె:—

ఆరజతగిరినలరు నారామవాటికల
శారికలు గీరికలు కోరికలు గాంచున్. 1
అందుఁగల తెలిచాయ మందారతరుకుసుమ
బృందములు కుందములు చిందములఁ గెలుచున్. 2
మాటికగ్గిరి శిరోమణి రుద్రకన్యకల
యాటలును బాటలును మాటలును వెలయున్. 3

వ. అట్టి కైలాసశైలంబున కధీశ్వరుండైన యాశ్వరుం డెట్టువంటి వాఁడు.

సీ. ఒప్పునెవ్వని వింటికొప్పు ఋక్షశ్రేణి
యశ్రాంత విశ్రాంతి కాదియగుచు
నమరునే స్వామి కాహారమై భువనదు
ర్దాంతభీకర విషానంతమూర్తి
ఋటమయ్యెనే దేవు నటనంబు తతయోగ
ఘనమండల క్రియాభినయగతులఁ
జెన్నొందిరేమిటి కన్నులై యార్యాభి
హితభాస్వదజ్జారికృష్ణపదులు
పాసఁగ నేవేల్పుకాండమై భూరిసంజ్ఞ
పటిమ వెలయింప...ల...విహారి
యట్టి పరమేశ్వరుండు దయాపరుండు
కాపురము సేయు (మండునా)కటకసీమ.

వ. మఱియు నప్పరమేశ్వరుని ప్రభావం బెటువంటిది.

జంపె:—

కనువెంటఁ జనుమంట ననవింట మనుదంట
తనువంటఁగను బంటుతనము గనిపించెన్. 1

జగకందు జిగిచిందు తొగవిందు సిగఁబొందు
సొగసొందు సిగబొందు తగబొందుపఱచున్. 2

బలుచండి పులిదండి పొలదిండి తలఁజెండి
యలవెండి మలనుండి యలవు వహియించున్ 3

వ. మఱియు నతని విహారంబు లెటువంటివి.

లఘుశేఖరం:—

అలకరాజు వని నొకపుడు గిరిజఁ గలిసి మెలసి యలసి
సొలసి కొలఁకు గొలఁకుకలువ చెలువ చలువ లలవరించు.

భద్రవటము నీడ వీరభద్రముఖ్యులద్రిజాది
భద్రగతులఁ గొలువవెలయు భద్రగతుల నొక్కవేళ. 2

నింగిమెఱయుఁ దారశైల శృంగసౌధరంగమందు
భృంగి లాస్యభంగినయమెఱింగి యొక్కరొడఁ జెలంగు.3

వ. ఇవ్విధంబున వివిధవినోదంబులఁ దగిలి యానందించుచు నా
నందివాహనుండు నిజమందిరంబునఁ దిరంబుగా నొక్కనాఁడు
నిండుకొలువై యుండెనట యెటువలెను.

త్రిపుట:—

పాటలామోదినులు కిన్నర
పాటలాధరు లెదుటఁ బాడెదు
పాట లాచిత్రంపు బొమ్మలబ్రతుకఁజేయన్. 1

మరల కలివలు వైచు వింజా
మరలు జిగివెన్నెలలు విన తా
మరలలాము కిరీట ముక్తామణులఁ గలయన్. 2

గంగయును బార్వతియు ముదమెసఁ
గంగఁ గన్నుల బెళుకులను పొసఁ
గంగఁ గర్పూరంపు టారతి గములొసంగన్. 3

వ. మఱియు నెటువలెను.

ఆది:—

రుద్రులు గుహావీరభద్రులు భద్రాను
భద్రులు సురపట్టభద్రులు గొలువన్. 1

సిద్ధులు మిగుల ప్రసిద్ధులు నణిమాది
సిద్ధులు సుజ్ఞానవృద్ధులు గొలువన్. 2

ముక్తులు బహువిధశక్తులు నిజపద
భక్తులు పరమపవిత్రులు గొలువన్. 3

క. కలవాని కొదవుచదువులు
మలసి మహామునులుపొగడు మనువులు దిక్పా
లుల మనవు లవధరింపుచుఁ
గులగిరి సుతపెండ్లికొడుకు కొలువున్నయెడన్.

మట్టె:—

తనకుఁదానె మహతిమొరయ
ధవళచామరంబు మెఱయ
కనకకుండిక కరము దొరయ
ఘనతయోగపట్టెమెఱయ. 1

జడలు జిగురు తొగరు గెలయ
జపసరంబుచేత మలయ
నొడలికాంతి దిశలవెలయ
నుడిని విష్ణు నామమొలయ. 2

నారదుండు క్రియలకలహా
నారదుండు గీతికావి

శారదుండు కాంతివిజిత
పారదుండు వచ్చెనపుడు. 3

వ. ఈలీలఁ గైలాసశైలాసన్నవర్తియై యమ్మునిచక్రవర్తి తన వెంబడిం బఱతెంచు తుంబురునితో నే మనుచున్నాఁడు.

జంపె:—

బహుళపక్షమునందుఁ బాయుచంద్రునికళలు
మహి నజుఁడు ప్రోగిడిన మాడ్కిఁ దగె నగము. 1

నిడిమేనిచుట్టగా నిడి శిఖరమిషమునను
పడగలెత్తిన భుజగపతిఁబోలె నగము. 2

పలుకాంతి దిక్కులను బలియు ప్రమథులకీర్తి
యిల నిటుల నిలిచెనన నెదిగె నీనగము. 3

ద్వి:—

అని తుంబురునితోడ నలవెండికొండ
ఘనత వర్ణించుచుఁ గలహాశనుండు
చనిచని యద్ధరాచలమునఁ బుణ్య
జన యక్షకిన్నర సంకులంబైన
యలకాపురముసొచ్చి యమ్మహావిభవ
ముల కరుదందుచుఁ బురసమీపమునఁ
గర మొప్పు నందలకా నామనదులఁ
బరికించి ముఖపద ప్రక్షాళనంబు
లొనరించి తటమున నొప్పు శృంగార
వనములు తోఁపులు వరుసతోఁ గడచి
మరకతసోపానమణివితర్దికలఁ

బరమోత్సవమొనర్చు భద్రవటంబు
నీడనించుక సేపు నిలిచి యాసరణి
వైడూర్య గోపురద్వారంబుసొచ్చి
మగరాలమెట్లపై మసలకనెక్కి
తొగరెల నీరాజగతుల నిగనిగలఁ
జెలువొందు నిలగట్టు శిఖరాగ్రసీమ
బలువైన మణిమయ ప్రాకారతతులు
క్రమియించి యుప్పరిగలు చంద్రశాల
లమరసౌధంబు హర్మ్యంబులు గలిగి
విలసిల్లు వీథుల వేడ్కఁ గన్గొనుచు
మలయజవాసిత మార్గంబువట్టి
నవరత్నమయతోరణంబులచేత
ధవళవృషాంక కేతనములచేత
పొలుచుచు సౌగంధికముల మేలుకట్లు
నలువొందు ముక్తిమంటపసహస్రములు
చేరియావల విరాజిలు హజారములు
దూరి కావలి ప్రమథుల దారి మీఱి
మురజవాదిత్రగోముఖ శంఖపటహా
గురువాద్యములు శైలగుహాలు మార్మోయ
మాణిక్యమయదీప మాలికాతతుల
రాణించు నంతఃపురము ప్రవేశించి
ఘనతరకలధౌతకనకవేత్రములఁ
దనరునాంతర గృహద్వారపాలకుల

సెలవుగైకొని సదాశివుఁడు గొల్వున్న
కొలువుకూటంబు ప్రక్కన డాయఁబోయి
ఘనగాంగశీకరాకరమాళితోడ
ననిచిన హరిచందనముఁబోలు వాని
గరళనీలిమఁజెందు కంఠంబుతోడఁ
బరిపూర్ణహరిణాంకు ప్రతివచ్చువానిఁ
బ్రకటసౌభాగ్యసంపద యొక్కవంక
నొకవంక ననురక్తియును జూపువాని
శివుని భద్రాసనాసీనునిఁ గాంచి
యవిరళపులకాంకురాంకితుఁడగుచు
జయజయ సర్వేశ, శంకర, యనుచు
భయభక్తియుక్తుఁడై ప్రణతులుసేసె.

వ. ఈప్రకారంబున నారదుండు పరమేశునకు దండప్రణామంబు లాచరించి యేమని కీర్తించుచున్నాఁడు.

కుఱుచజంపె:—

శరణుగౌరీ మనోల్లాసా, శరణు
శరణు బహుమాయావిలాసా. 1

శరణు సామజకృత్తివాసా, నీకు
శరణయ్య కైలాసవాసా. 2

శరణు కందర్పసంహారా, శరణు
శరణయ్య భుజగేంద్రహారా. 3

శరణు వందారు మందారా, నీవె
శరణయ్య భవరోగదూరా. 4

శరణు చతురాగమతురంగా, శరణు
శరణయ్య సదయాంతరంగా. 5

వ. అని స్తుతియించి నిలుచున్న నారదునిగౌరవించి కూర్చుండ నియమించి పంచశరవైరి యేమనుచున్నాఁడు.

త్రిపుట:—

ఏమి నారద లెస్సలా యిపు
డెచటనుం డిట కరుగుదెంచితి
వేమియైనను వింతగలదా భూమిలోనన్. 1

కనలుచును లోకములఁ గాలుచు
కాలకూటము సంభవించిన
వెనుక వారిధి నేమిపుట్టెనో వినఁగ లేదో. 2

అమృతవార్ధి మథించు నెడ నీ
వచటనుంటివిగద జనించెనె
యమృత మరుసులు సురలుగొనిరె నిజాంశములను. 3

పూనితామే పంచుకొనిరో
పోరు సేయఁగఁ బెద్దలెవ్వా
రైన సరిగాఁ బంచిరో యపుడది గణించు. 4

అనిన మునికలహాశనుఁడు గా
వునను హరివైఖరులు ప్రమథులు
గనలిపడ శంభునకుఁ దెల్పెదఁ గాక యనుచు. 5

వ. ఆనందసంపన్నుండై పన్నగాభరణునితో నేమని విన్నవించుచున్నాఁడు.

జంపె:—

అవధారు దేవ మీరటులు విషముహరించి
భువనములఁ బ్రోచి ప్రియమున వచ్చినంతన్. 1
వనరాశిఁ బొడమె ధన్వంతరి యనందగిన
ఘనవైద్యవరుఁ డమృతకలశంబుతోడన్. 2
అతనికరముననున్న యమృతకలశము గొనిరి
దితిసుతులు బలిమిసెడి దేవతలుజూడన్. 3

వ. ఈవిధంబున సుధాకలశంబువోయినఁ గులిశాయుధ ప్రముఖులగు సురలు భయాతురులై హరికి మొఱవెట్టిరఁట యెటువలెను.

ఏకతాళి:—

హరి నారాయణ యర్థపరాయణ
సరసిజలోచన శౌరి జోహారు. 1
గమకముతో రక్కసులు సుధాకల
శము హరియించిరి స్వామి పరాకు. 2
చిందరవందర జెందక ముందర
మందరధర సుధ మాకీవయ్య. 3

వ. అని మొఱవెట్టుచున్న వేల్పుమన్నీలఁ గనుసన్నన వారించి క్రన్నన వెన్నుండు జగన్మోహినివేషంబు వహించెనప్పు డెటువలెను.

త్రిపుట:—

కలువరేకులనేలు కన్నులు గబ్బిసిబ్బెపు గుబ్బచన్నులు
మొలకనవ్వులు ముద్దుమోమును మురువుమీఱన్. 1
కులుకునడలును దళుకువోడలునుగళుకుబంగరుచాయ యొడలును
తలిరుమోవియు నలరుతావియు చెలువుమిగులన్. 2
చెలఁగుతోలకరి మెఱుపుచందము జీవరత్నపు బొమ్మయందము
గలిగి హరి భువనైకమోహన కాంత యయ్యెన్. 3

వ. అప్పు డెటువలెను.

జంపె:—

కపటసతి పదకాంతి కనకకెంజడలజిగి
తపసులకు ననురక్తి తలకెక్కెన భవా. 1
అలివేణి ఘనలీల వలనసుమనఃపాళి
పులకాంకముల వేరఁబూచెఁ బరమేశా. 2
మోహినీ శృంగారమూర్తి గను దానవుల
మోహాంధకారంబు ముంచుకొనెరుద్రా. 3

ఆటతాళము:—

బలిముఖాసురు లమృతరసమున బలియునాసలమానిరి
లలనతోరతిమీఁది తమిఁ గైలాసవాస. 1
వెలఁది చిఱునగవనెడి వెన్నెల వేడ్కలూలయగతమయశ
ములు దలంపరు రక్కసులు వటమూలనిలయ. 2

ప్రమదనెపమున మరుఁడు తను తాపములుజూప దనుజులు
తమప్రతాపము లెంచరై రపు డమృతరూపా. 3

వ. అప్పు డయ్యొప్పులాడిం దప్పకచూచి దేవదానవు లేమను
చున్నారు.

జంపె:—

వెలఁదితేనియలొలుకఁ బలుకఁ దా నేర్చెఁబో
పలుకులకు నెటుల కప్రపుఁదావి గలిగెన్. 1

మగువవెన్నెలలు జిలుకఁగ నవ్వనేర్చెఁబో
నగవులకు మురిపెంపు వగ లెట్లుగలిగెన్. 2

పటువు గుబ్బెత యంచవలె నడవనేర్చెఁబో
నటనగల నడకు కులుకెటులఁ గనిపించెన్. 3

క. అని చెలువమెంచ వైరో
చని మోహముమించ మెచ్చిచనవిచ్చి ప్రియం
బునఁ బంచిపెట్టు మందటి
కనుచు సుధాకలశ మొసఁగ నమ్మానినియున్.

రచ్చరేకులు:—

కమ్మజిగి చెక్కుల నటింపఁగ
నెమ్మొగమ్మునఁ గళలుమించఁగ
చిమ్మచీఁకటి కొప్పునించఁగ
కమ్మవాసన దిశలు ముంచఁగ. 1

కలికిచూపుల వలపుదొలఁకఁగ
కచభరంబునఁ గౌను బెళుకఁగ

పలుకు పలుకునఁ దేనెలొలుకఁగ
పొలుపు నడలను ముద్దు చిలుకఁగ. 2
కొమరుగుబ్బలపైఁట జాఱఁగ
కుచ్చెలలముడి సొగసుదేరగ
నమృతకలశముచేత మీఱఁగ
నమరె నసురుల వలపులూరఁగ. 3

వ. ఇటుల నయ్యింతి వేల్పుల పూవులబంతి యమృతంబు పంచుచున్నప్పు డెటువలెను.

మట్టు:—

జాఱుకొప్పుచూచి యొకఁడు
జంకెనలకు భ్రమసియొకఁడు
ఓరచూపుఁ జూచి యొకఁడు
తారతీరుఁజూచి యొకఁడు. 1
మొలకనగవు వలచి యొకఁడు
ముద్దుమోముఁ జూచి యొకఁడు
తళుకుఁజెక్కు లరసి యొకఁడు
కులుకు గుబ్బలెంచి యొకఁడు. 2
మారుబారికోర్వలేక
మారుమాటలుడిగి దనుజు
లూరకుండి రమరవరుల
కొసఁగె నమృతమెల్ల నతివ. 3
ఆవెలందివైఖరులకు
నసురవరులు వలచుటెంత

భావజారి, నీవుగన్న
భ్రమసిపోదు వింతయేల !. 4

వ. అని యంత నిలుపక కలహప్రియుండు వెండియు వెండికొండ వేల్పుతో నేమనుచున్నాఁడు.

జంపె:—

పదివేల చంద్రబింబములొకటఁ బోడమనీ
మొదట నాముదితమోముఁనకు సరిగావు. 1
వేవేలు విరిదమ్మి విరులుగుమిగూడనీ
యా వెలఁది కనుఁదోయి ఠీవి గనలేవు. 2
కోటిసంఖ్యల హంసకులము నడయాడనీ
యా చెక్కులాడి సోయగపు నడలేదు. 3

చ. అని కలహాశనుండు కడునచ్చెరుపాటు ఘటిల్లమోహినీ
వనితవిలాసవైఖరులు వర్ణనజేసిన శంభుఁడాత్మలోఁ
గనలును విస్మయంబుఁ గుతుకంబుఁ బెనంగొన శైలరాజనం
దన చిఱునవ్వునెమ్మొగమునం దనచూడ్కులు నిల్పి యిట్లనున్.

ఆటతాళము:—

వింటివే కలకంఠి యీముని వీరివారి ననిమోడి
దంటతనమున నన్ను నెంచక తాకనాడెఁ. 1
రమణియగు హరిఁజూచి లోకులు భ్రమయునటులు నేనును
భ్రమలఁజిక్కుదునఁట యిదెక్కడి పలుకుచెపుమ. 2
కలహముని నావద్ద నూరక కల్లలాడెను నేఁ జని
నలినానాభునిఁదెలిసి చూడక నమ్మరాదు. 3

సొలపుఁజెందక నేను మోహినిఁ జూచునపుడు నీవెఱఁగ
తెలిసెదవు నా విరతిభావము తేటపడఁగ. 4

వ. అనినఁ బార్వతి పరమేశ్వరునితో నేమనుచున్నది.

త్రిపుట:—

మీరు నవముగ మోహినీ శృం
గారవిభవము చూచి పదరిన
గౌరవము దవ్వగును నవ్వగు ఘనులలోనఁ. 1
రానిపోని ప్రయోజనంబులు
పూనుకొనఁదగవాని కోపము
మానువారు వనాంగనాజన మానచోర. 2
ఆడకుం జనవలదు వెన్నని
కోడె ప్రాయపు కలికిరూపము
చూడవలదెటుపోయి యెటువచ్చునో మహేశ. 3
వెగటు వల దవధారు మీమది
వెన్నవంటిది మరుఁడు మొదలనె
తెగువగల పగవాఁడు హరియును వగలకాఁడు. 4
తవిలి దేవర పూనుపూనిక
తగ దనఁగ నే నెంతదానను
శివ, మనంబునఁ దోఁచినటువలెఁ జేయుమయ్య. 5

వ. అనిన వెడనవ్వునవ్వి వెడవిల్తుని పగవాఁడు వెలఁదితో నేమనుచున్నాఁడు.

జంపె:—

ఇదియేమి నామహిమ యెఱిఁగియుండియును నా
రమనివలెఁ బలికెదవు రమణిరో నీవుఁ. 1

భువనముల భ్రమయించు పురుషోత్తముని మాయ
భువనాధికుని నన్ను బొదువఁగాఁ గలదె. 2

మరు బారికలె నేను మగువ మిముబోఁటి సుం
దరులఁబొందుట లోక నటనకై కాని. 3

మానవాదులు నాయధీనము లధీశ్వరుఁడ
నేనెఱుఁగకుండ మరులెటుల జనియించు. 4

వ. అని జగన్మోహిని సౌందర్యసందర్శనానందపరుండై పలుకు ఫాలనయనుని పయనంబు నిశ్చయంబు సేయఁదలఁచి నవ్వు చందంబున నారదుం డేమనుచున్నాఁడు.

త్రిపుట:—

కలికి పయ్యెదలోని కుచమును
వెలిగనంబడు గుబ్బఁజూచిన
తలఁప విల్లును మొదటివిల్లును ధవళదేహా. 1

జంటగా నూగారు సకివిరి
సరుల కీల్జడగనినఁ గైకొన
వింటినారిని వింటినారిని వృషభవాహా. 2

వరవిలాసిని వళుల వీక్షా
వళులగని తలనున్న గంగా
కరతరంగము కరకురంగము మఱితుపభవా. 3

వ. అని మందెమేలంబునఁ గంధర్వవైరిఁ గేలివెట్టు నలువపట్టి దట్టించి రెట్టించిన కోపంబునఁ బ్రమథులెటువలె భర్జించు చున్నారు.

అర్ధచంద్రికలు:—

కినుక రదనములు కిటగిటగీటువారు
మొగమెఱ్ఱవార బొమ ముడివెట్టువారు
శివుని నిందింపవచ్చితె యనెడివారు
ఎటుల నీశ్వరుమహిమ లెఱుగుననువారు
ఇచట నితని ప్రతిష్ఠలేమి యనువారు.

క. పలుమాటలాడువారై
హాళహాళిఁబడు ప్రమథవరుల నడఁచి క్రియాకే
వలము త్తర మనుటెఱుఁగరె!
కలహప్రియు నింతదూరఁగా నేమిటికిన్.

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

ఏకతాళ:—

హరి యాడుతనం బరసి వికారము
బొరయ నపుడుగద గరువపుమాటల్. 1
సారెకు నీముని కేరడమాడఁగ
నూరకయుండుట యుచితముగాదు. 2
వగగల మగువల వలపుదలఁపడని
నగవలె జగమెన్నగవలె నన్నున్. 3

వ. అని శ్రీకంఠుండు వైకుంఠనగరంబునకుఁ బయనం బాయెనఁట. యెటువలెను.

కుఱుచజంపె:—

కరివన్నె నునుపట్టుగట్టి నుదుటఁ
బెరిమెఁ బత్తిరిబొట్టువెట్టి
చిఱుతచారల వన్నెచాల వెలయ
వెలిపించు సరులఱుత ప్రేల. 4

కమ్మవిలుగల వన్నెకాని హరువు
బొమ్మపెండియ మంఘ్రిఁబూని
సరిలేని నెమ్మేనిచాయ దిశలఁ
గరమొప్ప వెన్నెలలుగాయ. 5

అలరువేడుకల మున్నాడి బుధులు
గొలువ హిమశైలసుతఁగూడి
ఇరవొంద నందీశునెక్కి యెదుటి
సురవధూలాస్యములఁజొక్కి. 6

మురజాది వాద్యములు మొరయ వెడలె
హరుఁడు హరిపురి కింపువొరయ. 7

వ. అప్పు డెటువలెను.

లఘుశేఖరము:—

కుంచె విసరుకొంచు నవ్వుకొంచు శౌరిఁగాంచువేడ్క
ముంచుకొనఁగఁబోరుదిండి మునివరుండు పాలుదేర.
వనజనయనుమాయమాత్రమునకు మీరలేల మరులు
కొనకయుండ మేమెనేర్తుమనుచుఁ బ్రమథవరులుగొలువ.
శివవిరక్తి విష్ణుమాయఁజేరి చూతమనుచు నజుఁడు
దివిజమునులు బ్రహ్మయతులు దిక్పతులును గదిసికొలువ.

వ. చనిచని యానీలకంఠుండు వైకుంఠనగరోపకంఠంబుఁ జేరి కల
కంఠకంఠితో నేమనుచున్నాఁడు.

జంపె:—

హరియిల్లటపుట్టిల్లుఁ డాయెనని యుప్పొంగు
కరణి నుబ్బెడిపాలకడలిఁగను మఱివ. 1

తరుపఁబుట్టినవెన్న తఱిదిన్నె వేసిరనఁ
దీరుమీఱిన వెల్లదీవిఁగనుఁగొంటె. 2

నలువొంద మెట్టకెం దమ్మివలె వైకుంఠ
మలివేణి, కోటకొమ్మల రేకులలరన్. 3

వ. అనిన ధవళవర్ణుం డపర్ణకర్ణోత్సవంబుగా సుపర్ణవాహనుపురంబు
వర్ణించుచుఁ బ్రవేశించెనఁట యెటువలెను.

సీ. చెలువైన యుపవనశ్రేణికల్ గ్రమియించి
వికచవారిజగైన విరజదాఁటి,
వరరత్నమయబహిర్ద్వారదేశము దూఱి
బహుళవీథీ పరంపరలుగడచి
రమ్యహర్మ్యసమాజ రాజమార్గముపట్టి
పటుతోరణధ్వజ ప్రభలుగడచి
మహానీయమగుపురీమధ్యభాగముచేరి
కాంచనప్రాకారకలితమైన

గీ. ప్రథమగోపుర మెనసిలోపల ననేక
కక్ష్యలు గ్రమించి పరమభాగవతవరులు
ద్వారపాలకులాడాడఁ దమ్ముఁజూచి
వినయమొనరింప నలరుచు వేడ్కనవల.

# వి ష్ణు మా యా వి లా స ము



జంపె:—

చకచకలుగులుకు పచ్చలగతిని జూచి
చ్చికయనుచు గిబ్బతేజీ చౌకళింపన్. 1

పగడంపుఁ గంబముల నిగరంపుజిగిసొంపు
తొగరుపెంజడలతోఁ దుంపెసలు గునియన్. 2

తలపువ్వవలనఁ గ్రొన్నెలరాలమేడ గో
డలుగఱఁగి నెమిలిగుంపులకు సొంపెసఁగన్. 3

కమ్మక్రొవ్విరిమేలు కట్లుతావులకుఁ దన
కొమ్మ నెమ్మేనిజిగి తుమ్మెదలుగాఁగన్. 4

కనఁబట్టుగరుడకేతనుని పెద్దహజార
మున సాంబశివుఁడు వాహనమపుడు డిగ్గెన్. 5

క. ఈలీల నీలకంఠుఁడు
బాలామణిఁగూడి ప్రమథపరివృతుఁడై మో
సాలడిగియున్కి లక్ష్మీ
పాలుని కడకేఁగి ద్వారపాలురు దెల్పన్.

త్రిపుట:—

విని జనార్దనుఁ డతఁడువచ్చిన
విధము మనసునఁ దెలిసి నవ్వుచు
పునుకఁదాలుపుఁజూడ నంతఃపురము వెడలెన్. 1

పుడమితొయ్యలి మడుపులియ్యఁగ
నెడమవంకను వచ్చునిందిర
కుడిభుజంబున వామహస్తము కొమరుమీఱన్. 2

కుముదకుముదాక్షాదిదాసులు
సముఖమున హెచ్చరిక దెలుపఁగ
సమరవిష్వక్సేనుఁ డలబల మణఁచికొలువన్. 3

గచ్చులాడులు పట్టుబంగరుగచ్చుటరిగెల నీడ రాజస
మెచ్చ నొయ్యన వచ్చి హరిశివు నెదురుకొనియెన్.

వ. ఈవిధంబున నీలాచలంబు కైలాసంబును గదియవచ్చెనో యన నీలవర్ణుండు ధవళవర్ణుం జేరవచ్చి యెటువలె బహూక రించెను.

జంపె:—

కలిమిఁగు బ్బెత గబ్బి కమ్మకస్తురితావి
గలయ నుర మొరయ హరుఁ గౌఁగిటను జేర్చెన్. 1

భావమున ముద మొదవ భావజాంతకుసతిని
పూవిల్తుతల్లి చేఁ బూజ సేయించెన్. 2

తనపాదములకు వందనమాచరించు బ్ర
హ్మను మహేంద్రాదిసురలను గటాక్షించెన్. 3

వ. అప్పుగిది నప్పురాణదంపతులకు సముచితసంభావనంబు గావించి, నిజాస్థానమంటపంబు ప్రవేశించి, యుచితాసనంబుల వారి నుండ నియమించి తాను సుఖాసీనుండయ్యె నప్పు డెటువలెను.

రచ్చతాళము:—

కొలిచి రంబుజసంభవాదులు
తెలివిమీఱిన బ్రహ్మవాదులు
బలహరాది సుధారసాదులు
భక్తియుక్తులు వెలయసాదులు.

చేరిపాడిరి నారదాదులు
చెలఁగియాడిరి మేనకాదులు
కోరిపొగడిరి భార్గవాదులు
కొలువుచేసిరి భాస్కరాదులు. 2

యతులు సలిపెడి నుతులనాదము
నతులవాద్యవితాననాదము
సతులనర్తనగతుల నాదము
సభికులకు నిడె నతులమోదము. 3

వ. అంతఁ గొంతసేపునకు శివకేశవుల చిత్తంబెఱింగి సభికులందఱు సందడులుమాని వింధ్యమాకయుడిన చందంబున నూరకుండి రప్పు డెటువలెను.

ఆటతాళము:—

అలఁతినవ్వు మొగంబునను జెలువారగాను శంభుఁడు
పలికెఁ బడిరూపములుదాల్చిన ప్రభువుతోడన్. 1
పంకజోదర నీవు స్త్రీరూపంబుదాల్చి మోహము
లంకురింపఁగఁజేసితట దేవాసురులకు. 2
తెమలకావిధమెల్ల సురముని దెలిపినాఁడు మా చి
త్తమున కచ్చెరుపాటు సంతోషము ఘటిల్లన్. 3
సొలపుగల నీయాఁడురూపము చూడఁగోరి వచ్చితి
సొలవ కప్పటి రూపు గ్రమ్మరఁ జూపుమిపుడు. 4

లఘుశేఖరము:—

నన్ను ధిక్కరించినాఁడు నారదుండు నాతిరీతి
నున్న నిన్నుగన్న భ్రమసి నన్ను నిన్ను మఱతు ననుచు. 1

నావిర క్తివై భవంబు నీవిశేషమాయ జగము
లీవిరించి ముఖులుదెలియ నింతివగుము వింతయేల. 2

మరుని సంహరించి మిత్తి మదమణంచి యున్న నన్ను
మరులు పరుపవశమె నీకు మాయదారివగుచు రమ్ము. 3

వ. అని వెడవెడ నలుకవొడమి పలుకు నళికనయను పలుకుల
కనుగుణంబగు భంగి భృంగిరిటి ప్రముఖులు కొన్ని దురోక్త
లాడిన నన్నియు విని సహించి వెన్నుండు చిన్నినవ్వు దొలుక
మొగంబువంచి యేమని చింతించుచున్నాఁడు.

త్రిపుట:—

ఔర! పరమేశ్వరుని దురహంకార మిటువలె నుండవలదా
నేరమెంచఁగ నేమిచేసెను నారదుండు. 1

ఆవిలాసినిఁ గన్న దేవరవైన బ్రమయుదు వనుచు సామెత
గా వచించెనొ యేమొ యిందునఁ గనలవలెనే. 2

బ్రమలువెట్టకతాళుకొన్నను బ్రతుకనిత్తురె వేల్పుతపసిని
ప్రమథవరు లటుగాన భర్గుని భ్రాంతుఁజేతున్. 3

మిగులవేగిరపడక మొదటను మృదువచోగతినుపచరింపఁగ
వెగటుఁసెందినఁ జూచుకొందము వెనుక ననుచు. 4

వ. డెందంబున నిశ్చయించి మాయామందస్మిత సుందరంబగు వద
నారవిందం బల్లన నెత్తి ముకుందుం డేమనుచున్నాఁడు.

జంపె:—

పామరులవలపించు నామెలుఁగుఁ బోణి రా
పామరుని దిన్ననీ కామోదమిడునె. 1

కలహాముని మాటలకుఁ జలపట్టి లేనిపని
తలపెట్టి యిటులాడఁ దగునె నిటలాక్ష. 2

మంచినెయ్యముతోడ మముఁజూడవచ్చి యీ
కొంచమగు పనికింత కోపింపఁ దగునె. 3

చూడ వేడుకరైనఁ జూతుగా కొకవేళ
నేఁడు నామాటవిని నెయ్యమునఁ జనుమ. 4

వ. అనిన ముక్కంటి దంటతనంబుతోఁ గంటుమానక యేమను చున్నాఁడు.

ఆది:—

నారదుపంతము నావైరాగ్యము
తేలక నూరక నూరికిఁ జనను. 1

పొందుగ మాటలపందిరిఁ బెట్టక
యిందుముఖివిగ నిప్పుడు ముకుంద. 2

నీమాయలు గన నేవచ్చితి నీక
తామసింపకుము నామీఁద దాన. 3

ఆటతాళము:—

అనుచు నహామికదోఁపఁ బలికెడు నభవుతోడ ననియెను
వనజనేత్రుఁడు బ్రహ్మమొదలగు వారువినఁగ. 1

మాటిమాటికిఁ గూర్మితో నినుమాన్యుఁడనుచుఁ బొగడిన
పాటియెఱుఁగక పదరెదవు కడుభాగ్యమాయెఁ. 2

మంచిదే మఱియేమి నిను భ్రమియించు టెంతపని యిది
పంచబాణుని సూడుదీరఁగఁ బణఁతి నగుదున్. 3

వ. అని బయలుమెఱసి భాషించిన కాంచనాంబను పలుకులు విని రోమాంచకంచుకితాంగులై సభాసదులేమని వితర్కించుచున్నారు.

జంపె:—

చెల్ల ! శౌరి ప్రతిజ్ఞ చేసె నెటువలెశంభుఁ
డుల్లంబు నిలుపఁగలఁడో యనెడువారు. 1

ఈమహాత్ములమహిమ లెవ్వఁ డెఱుఁగును వీరి
బూమె లూరకచెప్ప లే మనెడువారు. 2

పంచశరహరుఁడేమి కొంచెకాఁడా యతని
వంచనకు భ్రమయఁడను వారునైరందు. 3

వ. అప్పుడు భక్తవత్సలుండగు శ్రీవత్సలాంఛనుండు నారదుని ప్రతిజ్ఞనిలుపుటకై నిజమాయావిలాసంబు గనుపించువాఁడై యొక చిఱునవ్వు నవ్విన సభాస్థలం బెటువలెను.

జంపె:—

చిలుక సామ్రాణిదోరచెలఁగి పేరెము వారె
కళవళించెను జ్ఞానకాంత సిగ్గునను. 1

భక్తికాంత కృశించెఁ బటుయోగము నశించె
ముక్తి లక్ష్మియు ముఖాంబుజ మెత్తదయ్యెన్. 2

పులకించె సకలాంగములు నలువతొలిచదువు
దలఁచునెడఁ గామశాస్త్రము ముందుఁ దోఁచెన్. 3

ద్విపద:—

ఆరీతి భువనమోహనమందహాస
చారుముఖాబ్జుఁడై చక్రాయుధుండు

తనయోగమాయ చిత్తమునఁ దలంచు
కొనినంత సభ గ్రమ్ముకొని ఘుమ్ముమనుచు
వలచు నద్భుతమైన వాసన యొకటి
వెలసె నవ్వాసన వెంబడిగాఁగ
నెరులొంది యిరులు జెందెడు కొప్పువిరుల
పరిమళంబులు తేఁటిపౌఁజులఁ బిలువ,
కురులలోఁ జెలువంబు గులుకు నెన్నుదురు
కఱిమబ్బులోఁ జంద్రకళచందమునను
సొగసు నెన్నుదుటి కస్తురిరేఖ జోక
ముఖమున కొకవింత మురిపెంబు నింప
మొలకనవ్వుల ముద్దుమోము చంద్రునకుఁ
జళుకు కమ్మలకాంతి చామరల్వైవ,
సొలపైన నిడువాలు చూపులకైపు
కొలఁకులఁ గల్వరేకుల వానగురియఁ
గళుకు వజ్రపుటాలకమ్మలడాలు
తళుకుఁ జెక్కులతోడఁ దచ్చనలాడ
చెక్కుల మకరికా చిత్రపత్రములు
పెక్కు చక్కనిసామి టెక్కెంబుదెగడ
మోమున కెగయు చన్మోనలపై నధర
కోమలద్యుతులు కుంకుమసంకుజల్ల
ముద్దురాచిల్కలై ముంజేతఁ గలిమి
ముద్దియ మోహంబు ముచ్చటల్దెలుప
వరుసవ్రాలు మదాళివలయంబు లనఁగఁ

గరముల నీలంపుగాజులు వెలయ,
స్తనకుంభకుంభిదేశముఁ బాఱిజాఱు
ననుపమ మదధారయన నారుదనరె
గమనశ్రమంబుచేఁ గ్రమ్ము నూరువుల
గమకంబుచేఁ గౌను గడగడ వణఁక
గంటల మొలనూలి ఘణఘణధ్వనుల
నంటి జంటగ గిల్కుటంది యల్లాఱుయ,
జిలుగు పైఠాణిలో జిగిచిందుతోడలు
వలిపె చెంగావి పావడరంగు గులుక,
మలయు బంగరు గిల్కు మట్టెలడాలు
చలువకుచ్చెలలపై సరిగంచుఁ గూర్ప
నడచు నొయ్యారంబు నడలపై నాస
విడక యంచలు కాళ్ళవ్రేళ్లను బెనఁగ.
కరములపొంకంబు కళల బింకంబు
మరులుగొల్పెడు సొంపు మాయలముంపు,
కొమరుప్రాయపుమబ్బు గుబ్బలయుబ్బు
తమకించుహావంబు తరళభావంబు
చిన్నెలచందంబు చెలువుటందంబు
వన్నెలగులుకు గరువపుమేనితళుకు
మురిపెంబులో సిగ్గు మొగములో జగ్గు
చిరునవ్వులోఁ బైపు చిన్నారిరూపుఁ
గలిగి యంగజుని చిల్కుపతాని యనఁగ
నలరువిల్తుని మోహనాస్త్రంబనంగఁ

గలిగి రత్నపు బొమ్మ కమ్మ పూరెమ్మ
కలువల జోక బంగారు సలాక
నటనల ప్రోవు విన్నాణంబు తావు
మటుమాయల బిడారు మరుని కటారు
వలపుల దొంతి చామంతి పూబంతి
కులుకు కప్పురతావి గుజ్జులేమావి
యొరపు చక్కెరల మే లొప్పులకుప్ప
నెరతనంబుల ఠీవి నీటుల దీవి
తొలకరి మించు కంతునిచేతి యించు
సొలపు మాటలతేట సుమబాణుపేట
ఔర శృంగార! మయ్యారె యొయ్యార!
మారజం బెంత విం తాయె నటించు
పులకించి సభికు లద్భుతమంది చూడఁ
జెలఁగి మోహనలీల శివుమ్రోల నిలిచె.

త్రిపుట:—

నిలిచి నప్పుడె గుండె జల్లన
నివ్వెరపడి దేహ మెంతయు
పులకరింపఁగఁ దాల్మి నిలుపక పురహారుండు. 1

మరుల కోటుల సంఖ్య గూడుక
మరులు గొలుపఁగ నించు తూపుల
యొరపునను జెలి చూపు లురమున నుచ్చిపోవన్. 2

త త్తరంబున ఘేను నెఱుఁగక
దాను వచ్చిన రాకయును శివ
మె త్తినటువలె నప్పు డాడిన దెల్ల మఱచెన్. 3

వ. అప్పు డయ్యొ్యప్పులకుప్ప యొప్పిదంబు నప్పకచూచి ప్రమథులు మోహవిభ్రాంతులై రఁట యెటువలెను.

జంపె:—

శైవుఁ డొక్కఁడు బారఁజూచి మోహిని యనుచుఁ
గావరంబున నొకని గౌఁగిటను జేర్చెన్. 1
జడలువీడఁగ మహేశ్వరు సేవకుం డొకఁడు
ఎడతెగక శివమెత్తి శివ మాడఁ దొడఁగెన్. 2
ప్రమథుఁ డొకరుఁడు తమకపడి లేచి చెలి యనుచు
భ్రమసి కంబము పైఁడి ప్రతిమ ముద్దాడెన్. 3
ఒక వీరమాహేశుఁ డొద్ది శిష్యునిఁ జేరి
సకి యేమొ యని వాని జడలు పట్టీడ్చెన్. 4
ప్రమదమున నొకరుద్ర భటుఁడు తన కుంచెయని
గమకించి యొకని గడ్డముపట్టి తీసెన్. 5

వ. అప్పు డెటువలెను.

త్రిపుట:—

పాంచజన్య విభూతి గళమున
బటువు పిఱుఁదులఁ జక్రమహిమము
కాంచనాంబర రీతి తనువునఁ గానుపించెన్. 1

ఒప్పఁ గౌస్తుభదీప్తి వాతెఱ
నుప్పతిలు శ్రీవత్స నీలిమ
కొప్పునను కనుబొమల శార్ఙ్గపుకొమరు మీఱెఁ. 2

తేటకన్నుల మీనగతి తా
మేటి రహిఁ మీఁగాళ్లఁ గనియు ల
లాటనయనుఁడు వెన్నుఁ డౌట దలంపఁ డయ్యెన్. 3

వ. ఇటుల నిటలాక్షుండు విష్ణుమాయామోహవిభ్రాంతుండై
య మ్మోహినీకాంత సహజకాంతఁగాఁ దలంచి తనలోఁ దా
నేమని వర్ణించు చున్నాఁడు.

జంపె:—

ఔర శృంగార! మయ్యారె యొయ్యార!
మోహారె నెఱతనము! మాయురె యారజంబు! 1

చాగురె విలాసంబు! చక్కఁదనము మజారె!
బాగు సొలపులసగలు! భళిరయ్య నీటు!. 2

వ. అని మఱియు నే మని వర్ణించు చున్నాఁడు.

ఆటతాళము:—

కొప్పు గాదిది గండుతుమ్మెద కప్పుగాని తుమ్మెద
కప్పు గాదిది చిమ్మచీఁకటి యొప్పుగాని. 1

మోము గాదిది నవ్వువెన్నెల గీముగాని వెన్నెల
గీము గాదిది మంచి తామర గోముగాని. 2

చెక్కు గాదిది కమ్మబంగరు నక్కుగాని బంగరు
నక్కు గాదిది మించు టద్దపు టెక్కుగాని. 3

మోవి గాదిది మావిచిగురుల తీవిగాని చిగురుల
తీవి గాదిది చీనిచక్కెర దీవిగాని. 4

నడలు:—

గట్టు రహిఁ గనుపట్టు దీని చను
కట్టు గనఁ దమిపుట్టుఁబో. 1

మీఁ పలు చెలినూఁగారు నలచీమ
బారు సారెకుఁ గేరుఁబో. 2

మించు చెలిమేనిమించు తోలకరి
మించుగమి నాక్రమించుఁబో. 3

వ. అనివర్ణించి చిత్తజాతాతి చిత్తచలనంబుతోఁ దత్తరించెనట
యెటువలెను.

రచ్చరేకులు:—

మించు మోహము నించు మదిఁ దమ
కించు లేమఁ దలంచు నలుగుడఁ
గాంచు తరి గాదంచుఁ దమి మర
లించుఁ దల యిటు వంచుచున్. 1

పేరువిను తమిఁ జీరు సన్నపు
జాలుపయ్యెద మీఁ పలు గుబ్బల
తీరుఁ గను బలుమారు తన కొన
గోరు మోపఁగఁ గోరుచున్. 2

రంగు మీఁ పలు మెఱుంగు మేనితె
రంగు నడల బెడంగు బొఁగడఁ దొ

డంగు గీరతరంగు(?) వెతలఁ గ
అంగు దాల్చి దొలంగుచున్. 3

వ. అప్పు డెటువలెను.

క. గౌరీనాథుని మాయా
నారీతిలకంబుఁ జూచు ననవింటి దునే
దారి నెఱవాడి కలువ ల
కోరుల సోయగము గడలుకొనఁ గనుదుదలన్.

త్రిపుట:—

తను గనుంగొను వనితఁ గనుఁగొను
తాను గనుఁగొనఁ గొంకు శంకరుఁ
డెనసి చూచిన రెప్పవ్రాల్చునో యను భయమున. 1

చెలువ యొక్కడ యేమి ర మ్మని
పిలువ మిక్కిలి వెఱచు పురహరుఁ
డలిగి వెగటున నిలువ కేఁగునో యను భయమున. 2

వెతలఁ బెట్టక నేలు మని తన
వితము దెలుపఁగ నోపఁ డభవుం
డతివ తన చెలువంబు మెచ్చదో యను భయమున. 3

వ. ఈచందంబున నిందుధరుండు డెందంబునఁ గోర్కులు సంద
డింప నే మని వితర్కించు చున్నాఁడు.

జంపె:—

మొనపల్లు మొనసియును మొనయని విధంబునను
ననఁబోణివోవి పానక మానవలయు. 1

క్రమ్ముకొని కదిసియును గదియని విధంబునను
కొమ్మఁ గౌఁగిట నుంచుకొని యాడవలెను. 2

నన్నువంటి రసజ్ఞునకు దొరికితే దీని
నెన్ని చందముల రతి నేలుకో గలను. 3

వ. అని పైపై తమకించి మఱియు నేమని యాందోళించుచున్నాఁడు.

ఘంటారవము - పదము:—

కొలువువారు సూడఁ గులుకులాఁడి తోడ
వలపుముచ్చటాడ వన్నెదఱుగు నీడ. 1

కనుచాటించుకైనఁ గలిగితే యీలోన
నెనలేని మోహాన నింతిఁ గూడుకొన. 2

చిన్నెలచేఁ జాలఁ జెలువొందు నీబాల
మన్ననతో నేలకున్న జన్మమేల. 3

వ. అని చిగురువిల్తుని పగవాఁడు తెగువచేసి తలంచెనఁట యెటువలెను.

నీలాంబరి - పదము:—

ఏలాగైనఁ గాని దీని నెలయించి కొనిపోయి
బాళిమీఱ నేలకున్న భావమునఁ దాళరాదు. 1

కొలువుదేవతలెల్లఁ జులక చేసినఁ జేయనీ
యలిగి పార్వతి నాతోఁ బలుక కుండిన నుండనీ. 2

విన్ననై ప్రమథులెల్ల చిన్నవోయినఁ బోవనీ
వెన్నుఁడింతేనా యని నన్ను నవ్విన నవ్వనీ. 3

లఘుశేఖరము:—

అని తలంచి శౌరిచేత నంపకంబు గాంచి వెనుక
వనిత బలిమి తాగ్రహించి చనుట కాత్మ నిశ్చయించి. 1
వెన్నుఁ డున్న దిక్కుఁ గన్న పొన్న బొమిడికపు వజీరుఁ
గన్న మేటి నతని ముందు గన్న చోటఁ గానఁ డయ్యె. 2
ఆలిఁ గానఁడయ్యెఁ బ్రమథపాళిఁ గానఁడయ్యె దేవ
తాళిఁ గానఁడయ్యెఁ జిలువతాళి వేల్పు విష్ణుమాయ. 3

వ. ఇవ్విధంబున నెవ్వరిఁ గానక యవ్విలాసిని జవ్వనంబుపై భావంబు నివ్వటిల్లఁ బూవిల్తు క్రొవ్విరువ్వ రవ్వ కాడు...ల్లం గలయఁ జూచు నప్పు డెటువలెను.

త్రిపుట:—

కనకసాలము లెల్ల నచ్చటఁ గనకసాలము లయ్యెఁ గీర్తులు
గనిన పున్నాగములు పున్నాగమ్ము లయ్యెన్. 1
కోమరుగల లతకూన లట లతకూన లయిలా గనిరి సవికా (?)
సమన సుమనోజాతి సుమనోజాతి యయ్యెన్. 2
కనలికా నవకౌశి కాదులు క్రమముగా నల కౌశికాదులు
మొనసె నారదమునియు నారదముల తెఱంగు. 3

వ. మఱియు నెటువలెను.

జంపె:—

సొగసు చిత్తరులఁ దగు శుకపికాదివినోద
ఖగజాతు లట సహజఖగజాతు లయ్యెన్. 1

తళుకు కెంజాయ చందా కెంపు టోవరులు
కలయఁ బూచిన మోదుగుల చందమయ్యెన్. 2
పలుతావు లోలయు సాంబ్రాణిధూపంబు పొగ
లెలతేఁటి తెగల రూపుల కైపు మీఱెన్. 3

వ. ఈలాగున నాస్థానం బంతయు నుద్యానవనంబైనఁ జోద్యపడి యక్కలుపకంటి యొంటిపాటునఁ దగిలె నని మిక్కిలి యుబ్బుచు మిక్కిలికంటివేల్పు తత్తరంబునఁ దలంకుచు మోహంబు ముప్పిరిగొన నప్పుడు తాఁగూర్చున్న భద్రాసనంబు డిగ్గి య గ్గజగామినిఁ జేరవచ్చె నప్పు డెటువలెను.

ఆటతాళము:—

ఒడలు గడగడ వణఁక నడుగులు తడఁబడంగ స్వేదపు
జడి లలాటము డిగ్గి చెక్కుల జాలువారన్. 1
కన్నుఁగవఁ బ్రమదాశ్రుకణములు గ్రమ్ముకొనఁగా బెబ్బులి
వన్నెదుప్పటి జాఱ మోమున వలపు దేరన్. 2
మోహవారిధి ముంచుకొన మఱి ముందువెనుక దోఁచక
మోహినీశృంగారవతి సమ్ముఖము జేరన్. 3

కుఱుచజంపె:—

చేరి నిలిచిన పురవిదారిఁ జూచి
తారసిల క మ్మాయదారి
వే ఱొక్క పాద రిల్లు దూఱి యట్టె
జాఱె సురపొన్నగుమి దారి
హారుఁ డది డాగి చను టెఱిఁగి యచటి

కరిగి కానక వెతలఁ గఱఁగి
విరజాజిపొద లెల్లఁ దిరిగి తిరిగి
సొరిగి యుత్సాహంబుఁ దఱిగి.

వ. తనలోఁ దా నేమని చింతించు చున్నాఁడు.

నీలాంబరి - పదము:—

పల్లవి:—

నిలిచె నిందు నన్ను - దలఁచె నన్నుముందు
కలికి యింతటిలో నె - క్కడికిఁ బోయెనో గాని

కులుకుసిబ్బెపు గు - బ్బల మెఱుఁగులు
మొలకనవ్వుల ముద్దు - మోమున కెగయగ
వలరాయఁ డాడించు - కలికి రత్నపుబొమ్మ
వలె నెఱనీటుతో - వచ్చి యింతసేపు ॥ నిలిచె ॥ 1
కేరి చిగురు ల - కోరి కోలల మి
టారి మదనుఁడు (సారె) - సారెకు నిగిడించి
చేరి యొయ్యారపు - చికిలి చూపుల నన్ను
గోరికతోఁ గసు - గొనుచు నింతసేపు ॥ నిలిచె ॥ 2
కన్నుల సన్నల - నన్ను రమ్మని పిల్చి
పొన్న పువ్వుల తావి - తిన్నెపై రతికేళి
మన్నించి నన్నేలుకో యని... (?)
యెన్నికతో భ్రమ - యించి యింతసేపు ॥ నిలిచె ॥ 3

క. నవ్వులకు దాఁగి యున్నదొ
జవ్వని నామనసుఁ జూడ సైరించినదో
యివ్వని నెక్కడ వెదకుదు
నవ్వనిత నటంచు నాతఁ డటునిటు చూడన్.

త్రిపుట:—

పొన్న చాయల హొన్ను రతనపు
తిన్నెపై నొకచిన్ని యడుగిడి
యున్నపాదము మణుచు కొని కడు
హొయలు మీఱున్. 1

జాలు కుచ్చెలు వామకరమున
జక్కఁ జెక్కుచు గబ్బిగుబ్బలఁ
జాలు ముక్తాహారవల్లులు
చొకళింపన్. 2

కంకణంబుల మేఖలామణి
కింకిణులతో మొరయ వేడుక
లంకురింపఁగ బంతి యాడు నొ
యారిఁ గాంచెన్. 3

మట్టె:—

కాంచి పెన్నిధాన మెదుటఁ గన్న పేద కరణి సహిం వ
హించె శంభుఁ డౌర భాగ్య! మిచట నతివఁ గంటి మరలఁ
ఇంతి పాణికాంతి బంతి యెఱ్ఱ నగుచుఁ జూపుసహిం నో
కింత నల్ల నగుచు నగవు లెనసి వెల్లవెల్ల నగుచు. 2

బవిరి దిరిగి యెగయు బంతిఁ బట్టి యొడియు నెడల నౌర!
యువిద గుబ్బ లెగిరి పోవుచున్న జక్కవల హసించు. 3

వ. అని యెంచి యప్పించుబోణి నేమరించి పట్టుకొనువాఁడై
శివుఁడు పొంచిపొంచి వచ్చె నట యెటువలెను.

జంపె:—

ఒడ లొకించుక వంచి యడుగు చప్పు డడంచి
పొడ గానఁ బడక పూఁ బొదలలోఁ డాఁగి. 1

గుజ్జులేమావి మఱుఁగున నుండి యజ్జగని
య జ్జలజముఖి పజ్జ కపుడు వడి నిగిడి. 2

ప ట్టీక తమి వెనుక పట్టుగా నట్టె చెలిఁ
బట్టి కౌఁగిట నుంచ బట్టబయ లయ్యెన్. 3

వ. అప్పు డెటువలెను.

ఆటతాళము:—

చేతనున్న ధనంబు పోయిన చింతనొందు నాతని
రీతిఁ గౌఁగిట నాతిఁ గానక భీతిఁ జెంది. 1

కలికి కౌఁగిట నలమఁ బోయిన కల్ల లయ్యె నిదియు నా
చలన గుణమొ మరుని మాయయొ కలయొ నిజమొ. 2

కాంత డబ్బరయైన నేటికిఁ గానిపించఁ గనుగవ
కింతి నిజకరమైనఁ గనఁబడ కెందుఁ బోయెన్. 3

వ. అని మఱియు నేమని నిర్వేదపడు చున్నాఁడు.

పదము:—

పల్లవి:—

ఎటువలె వేగింతు నింక అల్ల
మటు మాయలాడి కౌఁగిటికిఁ జిక్కకపోయె.

పరిపరి వగలచే బంతి యాడు
తరిఁ జమరించు న య్యింతి

మురిపెంపు నగుమోము ముద్దాడఁ బోయిన
మెఱుఁగు టద్దములోన మించు చందురుఁ డాయె. ॥ఎటు॥
పటిక నార్చిన పైఁడిబొమ్మ లీల
బటువు గుబ్బల ముద్దుగుమ్మ.
అటునిటు నడయాడు నాసచే డాసిన
కటకట ! కలలోనఁ గన్న బంగా రాయె. ॥ఎటు॥ 2

తియ్యవిల్తుని కేళి దాని మంచి
తియ్య చక్కెర మోవి యాని
తియ్య మయ్యెద నని చయ్యన గదిసినఁ
దొయ్యలి యయ్యయ్యొ ! తొలకరి మెఱుపాయె. ॥ఎటు॥

వ. ఎటువలెను.

గీ. విరుల విల్లాల్చు చొప్పడు విద్యవాఁడు
పడఁతి నే పుప్వపొదలఁ జొప్పడఁచినాఁడొ
చూచెద న టంచు నిలిచినచోట నిలువ
కతఁడు చరియించెఁ గహన వనాంతరమున.

వ. అప్పు డెటువలెను.

త్రిపుట:—

మంట కెందొగ గరడి పుప్పొడి మంటిలోఁ బొరలాడుతుమ్మెద
జంటి గమి ఝుంకార హుంకృతి చుట్టుకొనఁగన్. [డు
నిండు చాయల చిగురుఘుంటాడిండి పొదన మొండు చూపె
గండుఁగోయిల దిండిబారులు గ్రమ్ముకొనఁగ౯. 2

జోక కెక్కిన వీఁక గేదఁగిరేకు బాకు జరీన దూసటు
పోకు పోడుపోడు మనుచు మదనుఁడు ధాక జూపన్. 3

వ. నిర్వహింపలేక యమ్మోహినీకాంత నూహించి యే మని వేడుకొను చున్నాఁడు.

ఆటతాళము:—

హత్తుకొని వలరాజు కైదువ లెత్తుకొనియె గుబ్బల
నొత్తుకోవె చెలియ ప్రాణము లెత్తుకోవె. 1

మేలిమీఱెను మరుని బారులు బారుదీరె నో చెలి
చేరరావె తళుకుఁ జెక్కిలిఁ జీర నీవె. 2

హాళి ముంచెను చిలుక తేజి వయాళి మించె నాపగ
వేళ గాడె విరహవేదన తాళరాదె. 3

వ. అని మఱియు నెటువలెను.

జంపె:—

చిలుక యెక్కడనైనఁ బలుకరా దదిగొ చెలి
పలికె నక్కడ నంచు నెలమి నాలించున్. 1

శారి యెక్కడనైనఁ జదువరా దదిగొ యొ
య్యారి చదివెడి ననుచు నచ్చోటి కేఁగున్. 2

సవరైన తీఁగె యెచ్చటనైనఁ జూడరా
దువిద యిదె వచ్చె నని కౌఁగిటఁ గదించున్. 3

వ. ఇవ్విధంబున నవ్వనంబులోఁ బరిభ్రమించుచు నక్కడక్కడ నక్కలకంఠి వెదకి కానక నలుదిక్కులం జూచు నెడ నచ్చోటికి నొక యేలపాట వినంబడె నది యెటువలెను.

ఏలలు:—

మల్లె విరుల జోడు దొడిగి నల్ల చెఱకు విల్లుఁ బట్టి
మొల్లతూపు లుల్లసిల్లఁగ ఓ పంచబాణ!
చెల్ల! ఘనుల నెల్ల నేసేవు. 1

చల్లన వాసన వెదచల్లు తెమ్మెర తేరెక్కి
తెల్లదమ్మి చిల్లగోలతో ఓ పంచబాణ!
చెల్ల! నీవు గదియ నే భరానొ. 2

ద్వి.—

అను నేల లాలించి యానందమంది
మనసు మెత్త యొకింత మట్టుపడంగ
కలకంఠి గాదేని కలదె యీపాఃకి
కలకంఠ నాద మక్కలకంఠికైన
నరసివచ్చెద నంచు నల నాదువెంట
నరిగి కర్పూరంపు టనఁటుల లోన
కొమరైన లేమావి గుబురుల నడుమ
గుమిగొన్న సురపొన్న కొమ్మల యందు
పదిలమౌ మగరాల పడకల లోన
గుదిగొన్న పగడంబు క్రొందీగె లోన
మృదులంపు పాన్పుతో మెచ్చుకోనైన
యుదిరి బంగరు తూఁగు టుయ్యాల లోన
నెలమి నూఁగెడు వేళ నిల బిట్టు తాను
మలసి మెట్టిన కాళ్ల మట్టియల్ తోను
ఘలుఘల్లు మని యందెకవ ప్రోయఁగాను

వలపుగుబ్బల వీఁక వణఁకుచుఁ గౌను
నిగిడి తీవ్రతముచే నెగడు మై చాయ
గగనభాగమున బంగరుపూఁతఁ బూయఁ
జిగిదేరు నునుపైఁట చెఱఁగింత వాయఁ
పొగరు తేటులు కొప్పుపూలకై మ్రోయ
కేళి నుయ్యాల లూఁగెడు ముద్దరాలి
బాలేందుధరుఁడు తప్పక చూచి బాలి
యెడలిపోయిన ప్రాణ మేతెంచి మరల
నొడలఁ బ్రాపించి నట్లుత్సాహ మంది.

వ. తనలోఁ దా నే మని సంతోషించు చున్నాఁడు.

త్రిస్తబక:—

వింటిని ఏల లొంటినీ బాల
గంటి నీవేళ నో లాల.
వెన్నెలతోడ పొన్నల నీడ
సన్నలగూడ నో లాల.
వేడుక నైన వేడుకచాన
కూడక మాన నో లాల.

జంపె:—

వెలయు రహి నేఁ గనుక విరులసర మైయున్న
చెలువ యామోదమున శిరసావహించున్. 1

నిచ్చలును నేఁ గనుక పచ్చకప్పుర మైన
మెచ్చి పలుకులకు మొగ మిచ్చి మా టాడున్. 2

చెలువుగా నేఁ గనుక చలువ పైతానైనఁ
జెలువ గుణ మరసి గుబ్బలఁ గప్పుకొనును. 3

త్రిపుట:—

ఐన నిపు డేమాయె నే మా
యావిధంబునఁ బోయి కౌఁగిట
నానుకొని తమి దెల్పి యూడిగ మాచరింతున్. 1

అనుచుఁ జప్పుడు సేయ కెప్పటి
యట్ల మెల్లనె పొంచి డాసిన
వనిత క్రీగన్నులనె శంభునిఁ గనుచు నగుచు. 2

నిగిడి ముందర కూఁగి వడి నం
దియలు ఘల్లన కొప్పు వీడఁగ
బిగువ కురికి లతాంగి మిక్కిలి తీవ్రగతిని. 3

బెగడు లేడి తనంబునను శివు
బెదరి చూచుచు మేనితావులు
బుగులు కొనఁ గనుఁబడక చన్ఁ బూఁ బొదలలోనన్. 4

వ. ఇ ట్లక్కవడి న క్కుహనామోహనాంగి తన్ను గికురించి యెక్కడేనియుఁ బోయినఁ బెద్దయుఁ బ్రొద్దు చింతించి యెద్దియుఁ జేయ నేరక నిశ్చేష్టితుండై యప్పు డయ్యష్టతనుం డాయెలనాగ యూఁగిన తూఁగు టుయ్యలఁ గదియం బోయి యే మనుచున్నాఁడు.

జంపె:—

అపుడు సఖి కేల నిన్నంటె నో పచ్చిపగ
డపు తీఁగె నీ వేమి తపము చేసితివె. 1

బాల గూర్చుండె నీపై నిపుడు తూగు టు
యాల నీ వెంత భాగ్యంబుఁ జేసితివె. 2

ననఁబోణి నిన్ను మూర్కొని గారవించె నో
ననబంతి, యెంత పుణ్యంబుఁ జేసితివె. 3

క. అనిపలికి కలికి మును దుమి
కిన యెడకుం బోయి యడుగు కెందమ్ముల హ
త్తిన లత్తుక కుచముల చం
దనువుం బొడి కొప్పువిరులు దాఁ గని యచటన్.

వ. విరహోన్మాదంబున శివుఁ డేమేమి సేయు చున్నాఁడు.

ఏకతాళి:—

తనరుచుఁ జెలివిరి - దండలు గొని మూ
ర్కొను మూర్కొని తమిఁ - గనుఁగవఁ జేర్చున్. 1

పణఁతుక లత్తుక - ఫాలతటంబున
నిడుకొను నిడుకొని - యెంతయు నలరున్. 2

చెలి గంధముపైఁ - గలయ నించుకొనుఁ
గలయ నించుకొని - నలుఁగడ లరయున్. 3

వ. అప్పు డేటువ లెను.

జంపె:—

జవరాలి విరిసరులు - శమనారిచే నమరెఁ
బూవిల్తు మీఁదఁ బ్రతి - పూనెనో యనఁగన్. 1

సుదతి లత్తుక శివుని - నుదుటఁ దగె మరు మదము
కొంద దీర్చి మరుకన్ను - గూర్చుకొనె ననఁగన్. 2

చెలి గంధ మభవు మై - నలరె మరు తూపులకు
నలకి ధరియించు వజ్రాంగిబో డనఁగన్. 3

వ. అప్పుడు కప్పుకొన్న తమకంబున నయ్యొప్పులాడి చనిన యడుగుల చొప్పునంజని కప్పుమెడవే ల్పే మను చున్నాఁడు.

ఆది:—

దానిఁ జేరు టెన్నఁడో వెడవింటి
వానిఁ గేరు టెన్నఁడో
ఎదను హత్తు టెన్నఁడో దాని చిన్ని
పదము లొత్తు టెన్నఁడో 1

పాటఁబాడు టెన్నఁడో దానితో ముద్దు
మాట లాడు టెన్నఁడో
మేలు దెలియు టెన్నఁడో నను గేలి
గలియు టెన్నఁడో 2

నేద దేర్చు టెన్నఁడో విరహాబ్ధి
నీద నేర్చు టెన్నఁడో 3

వ. అని మోహినీ విలాస తత్పరుండై శంభుండు చరాచరంబులఁ జూచి యేమని యడుగు చున్నాఁడు.

ఆహిరి - పదము:—

కలికిఁ గానరె మరువంపు - మొలకలార - యీడఁ
జిలుకల కొలికిఁ జూడరా - చిలుకలార

కులుకులాడి యెందుఁ బోయెఁ - గొలఁకులార - ముదు
చిలుక యేదె జాజిపూవు - ములుకులార
ఎమ్మెలాడిఁ జూపరె కెం-దమ్ములార - పసిఁడి
బొమ్మ యిందు రాదుగా కుం-దమ్ములార
కొమ్మ మీరు గనరె పూవుఁ - గొమ్మలార ...
... ... ... ...
కలువకంటిఁ గంటిరె చెంగలువలార - అల్ల
చెలువఁ జూపరె రాయంచ - చెలువలార
వగలాఁడిఁ గానరె కేళి - నగములార - మీలో
మృగవిలోచనఁ జూపరె - మృగములార.

వ. అని చరాచరంబుల నడుగుచు నుడురాజశేఖరుం డగ్గడుసు గుబ్బెత నెక్కడం గానక గుడుసుకై దువదొరకొడుకు సేయు దుడుకులకు నుడివోని తుందుడుకులం బడిపడి యడరు బడలున నొడలు మఱచి నడచునెడఁ దడఁబడుచుఁ గొన్ని తరువులం బొడగని యే మనుచున్నాఁడు.

త్రిపుట:—

నారి యంటఁగ నవ్వఁ గన గా
నంబు సేయఁగఁ బూచితిరె సహ
కార కేసర తిలక బంధూ-కంబులార. 1

వనిత మొగసిరి యధరసుధ నెద
నునుప పద మిడ ననిచితిరి బళి !
కనక వకుళ కురంట కాశో-కంబులార. 2

చెలువయూర్పుల ననుచు వావిలి
చేరువనె దగు కర్ణికారమ
యలరు బొందితి వలెవ నీతోఁ - బలికె నఁటవె. 3

వ. అని దశదోహదంబులు గనిపించ తరువులం బలుకుచుఁ జరియించిన యచ్చంద్రధరు పురోభాగంబున వనదేవతాసతులు తోడిచేడియలుఁగ నమ్మాయలాడి కుసుమాపచయక్రీడ గావించు చుండె నది యెటులనెను.

రగడ - ఏకతాళి:—

ఓ మగువా పనమా మనవీడా
మామిడి విడువని మామని వీడా
పోగడదండ నినఁబోగడెద నీవా
బుగులుకొనెడి విరిపొదలో నీవా
సోలి గేదఁగులఁ జూడు పరాకా
కేలఁ గిల్లినది కెంజిగురాకా
వలపు లూరె విరవాదులు చాల
పోలఁతుక యిది విరిపుప్పొడి చాల
ఒడి నించితి వవియును మంకెనలా
అడుగఁ జూచె దహాహా లంకెనలా (?)
పూచిన కింశుకములఁ బొడుదమా
కాచిన నిమ్మల కడ నాడుదమా
అల చిలుకల రాయిడి నేయకువె.

నలువగు గొజ్జఁగి నన గోయకువె
మగువ మెట్టదామర మెట్టితివా
జిగి వావిరి చెవిఁ బెట్టితివా

వ. అని యొలదోఁటవేల్పుకన్నియలతోఁ గ్రొన్ననలు చిదిమి యా వన్నెలాడి కన్నులవిల్తు పగదాయ కన్నుల ముంగరఁ గొన్ని చిన్నెలఁ బోయెనఁట యెటువలెను.

త్రిపుట:—

జాళువా జిగి చందు నిజభుజ
మూలకాంతులు బయలు సేయుచుఁ
గేలి కందని కొమ్మఁ గైకొను వేళ బాల. 1

జాలునీవియు నాభితీరును
నాగుసోరును జూపు పొడవున
మీఁలు తీఁగెకు నిగుడు నపు డచ్చారువదన. 2

బిగి చనుంగవ యుదిరి బంగరు
నిగనిగల్ గనఁజేయుఁ బూవుల
తెగలఁ జిదిమియు పయఁట నిడునెడఁ జిగురుఁ బోణి. 3

చ. ఇటువలెఁ బెక్కురీతుల రహిం
గని య వ్వని జాలు పైఁటతోఁ
జిటిపొటి చెమ్మటల్ దొలఁకు
చెక్కులతో నెలదేఁటి రంతుతో
నటు నిటు నోరమోమిడు నొ
యారముతో నొక పొన్నగున్న చెం

గట మయినేద దీర్చుకొను కాంతఁ
గనుంగొని శంభుఁ డుబ్బుచున్. 4

వ. ఆఁకలిగొన్న వాఁ డమృతంబు గన్న చెన్నున తృష్ణాతురుండు చలిపందిరిఁ జెందిన చందంబున నానందించి యక్కుందరదన ముందరఁ జేరి యే మను చున్నాఁడు.

శ్లో. క్షమాం పాహి మోహిని దయాం మయి సంవిధేయి
వక్షస్థలే తవకుచౌ కలితాంగరాగౌ
సంఘట్ట యాధరసుధా మపి దేహి మహ్యం
త్వచ్చిత్తవృత్తి రధునా దయిత స్తవాహం.

శా. హేరాళంబగు బాళిఁ దాళుకొన లే కే నెంతొ చింతింపఁగాఁ
జేరం బిల్వవు గారవింపవు దయన్ జేపట్టి వింతేనఁటే
నేరం బెంచి మరుండు న న్నొబ్బదువఁగా నీకెంత సంతోషమో
యీ రారాపులు మాని యేలుకొనవే యేమే జగన్మోహినీ.

జంపె:—

అలివేణి నీనుదురు-వలె వెలయు ననికదా
యల బాలచంద్రు శిర - సావహించితిని. 1
కలికి నీనడలతోఁ - గలహించు ననికదా
అల గంధగజము గం - డణఁచి వేసితిని. 2
కలకంఠి, నీచూపు - బెళుకు గలదనికదా
అల లేడిఁ జేపట్టి - యాదరించితిని. 3

నీలాంబరి - పదము:—

నీవాఁడనే చెలి నీవాఁడనే
మోవి తేనియ లిచ్చి - త్రీవి న న్నేలవె.

తలయెత్తి చూడవె - పిలిచి మాట్లాడవె
పలుమారు వేఁడిన - చల మేల చేసేవె ॥ నీవాఁడ ॥ 1

మదనుఁడు పగవాఁడె - మనసు నిలుపనీఁడె
కదిసి దగ్గరరావె - కౌఁగి లియ్యవె ॥ నీవాఁడ ॥ 2

ఈడ నెవ్వరులేరె - యీ పొద రింటిలో
వేడుక నొకసారి - కూడి యుందము లేవె ॥ నీవాఁడ ॥ 3

నాదనామక్రియ :—

ఔన ! నేనింత - యాయాస పడఁగాను
మౌనమున నున్నావు - మాటాడ వేటికె
కానవె నినువంటి - కఠిన చిత్తముదాని
పూని కౌఁగి లియ్యవే ఓ ! భామ
నేను నమ్మితిఁ దాళలేను మ్రొక్కెదనె.

వ. అని వేడుకొను వేడిచూపులవేల్పుతో వెలఁది యే మను చున్నది.

నాదనామక్రియ:—

ఇదియేమి పరమేశ - యేల యీతమి పుట్టె
మదను గెలిచిన నీకు - మఱి మోహ మున్నద ?
మదిలోన నన్ను నొక - మగువ యని తలపోసి

పదరితే యొద్ది కౌన - ఔర ! నీ
హృదయము శోధింప - కిపు డేటిమాట.

వ. అని చెప్పి శివుఁడు కనురెప్పవేయు నంతలో భ్రమఁ గప్పి యప్పడంతి యంతర్ధానంబుఁ జెందిన నింతటిలో నయ్యింద వదన యెందుఁ బోయెనో యని దిగులుపడి నలుగడల వెద కుచుఁ దిరుగు చుండె మఱియు నెటువలె.

చూర్ణిక:—

తదను తనుకాంతివాహినీ మోహినీ మానినీమణీ
సందర్శ నోత్కంఠయా ఏతదిత స్తతః పరిస్రుత్య
నీలకంఠ స్తవకంఠవన ప్రదేశే పురోభాగభాసమానం
వలక్ష పక్షచలోభయపార్శ్వ విజిత చామర విరాజితం
విభాసిత వికసిత పుండరీకఘటా ఛాయా సమాచ్ఛాదితం
కనకమయ సరోజభాజనపుంజమధ్య రంజితకింజల్క-
మంజులదీప్తి దీపికాశిఖారాజనీరాజిత మమంద
మకరంద రసాస్వాద ప్రముదిత మత్తభృంగాంగనా
సంఘ మంగళ గాయకవ్రాత సంగీతభంగీలలాసం
సముత్తుంగ తరంగమాలికా తురంగావళీ సమారూఢ
కరకలిత శబరకరవాల నిరనూనుషకుమార సేవాదృతం
కాదవేదండ మండిత రమాసమం
చిత నిజ జీవనాసక్త స్వాంత దిగంతరాగత ద్విజవర
విరాజమాన నినా దాశీర్వాద సంపన్న కహ్లార పరాగ

చందనచూర్ణ వాసనావాసితం నికటతటి శోభమాన
ఫేనదుకూల సస్మితం సరోవర సార్వభౌమ మద్రాక్షీత్.

వ. ఇటువలె రహిం దొలంకు కొలంకు దన కెలంకునం గని కలంకు దీరి తత్తటంబున నొక చిత్రపటంబు గనఁబడిన హృత్పుటంబు దిటంబు మిక్కుటంబుగాఁ జెంగటికిం బోయిన నచ్చట న మ్మటుమాయలాడి జలకేళిఁ దేలుచుండె నట యెటువలెను.

లయగ్రాహి:—

సోలుచు సరోజములఁ దాలుచుఁ బరాగముల
రాలుచు రథాంగివలె వ్రాలుచును హేళిన్
గ్రోలుచు మరందములఁ బోలుచు మిళిందముల
ప్రేలుచు దరీలతల దూలుచును గేళిన్
దేలుచు జలేభముల గూలుచు మృణాళముల
జీలుచు మరాళములఁ దోలుచును బాళిన్
దాళుచు ఖగార్భటిని నేలుచుఁ గొలంకు దయ
మాలుచుఁ దొగన్నెలఁగఁ జాలుచుఁ జెలంగెన్.

వ. ఈ వడువున జలక్రీడ లాడు న మ్మాయలాడిని జూడ వేడుక వడి యాడకుం జని యా క్రీడావిట చూడామణి యేమని హర్షించు చున్నాఁడు.

కురుచజంపె:—

సొలపుగాఁ దలయెత్తి చూచె - మరులు
వెలయించె మరుబారి వీచె.

మచ్చికను నా గుణము మెచ్చె - మనసు
వచ్చి మా రు త్తరువు లిచ్చె.
చాటు కేఁగుటకు కనుగీటి - తగిన
చోట రతిదేల్తు నని చాటె.
ఇంత చన వొసఁగినది కాంత - యేల
యంతరంగమున కీఁ వంత.

వ. అని కలంకు మాని కొలంకున నలుకుఁడు వినఁబడకున్నఁ గ్రన్నన బయలుదేరి, యా మాయదారి నందుఁ గానక దీన వదనుండై మదనవైరి యే మని ఖేదపడు చున్నాఁడు.

ద్వి:—

అయ్యయో నా మోహ మూరడి చేసి
యొయ్యారి చేఁజిక్కియును జిక్క కరిగె
నలసితి సొలసితి నంగజుధాటి
నిలువ లేనంటి మన్నించవే యంటి
వలవంత నే నెంతవడిఁ దెల్పుకొన్న
నెలఁత మారాడ కుండెను గొంతసేపు
మాటలఁ దేలించి మఱికొంతసేపు
జూటుతనంబున సురిగె నెక్కడికొ
దాని దూఱఁగ నేల తగిలినబలిమి
నైనఁ గైకొనని నన్ననవలెఁ గాక
ఐన నావంటి భాగ్యము లేనివాని
కా నెలంతుక కూట మది యేలదొరకు
ఆచన్ను లా కన్ను లా విలాసంబు

లా చెక్కు లా టెక్కు లా యొయారములు
ఆ యంద మా చంద మా ముద్దుమాట
లా యొడ లా తోడ లా బిటారములు
కన్నులఁ గట్టిన కైవడిఁ దోఁచు
చున్న దెక్కడఁగాన నువిదఁ గ్రమ్మరను
ఈ వియోగసముద్ర మే తెప్పఁ గడతు
నీ విరహానలం బే వంక నార్తు
నింతి యెక్కడవచ్చె నే నేల దీని
వింత చెల్వము జూచి విరహ మందితిని
ఇంక నెప్పుడు చూతు నింతి నటంచు
శంకరుఁ డత్యంత సంతాప మంది
కనుదోయి నీరు గ్రక్కున గోటమీటు
కొనుచు నల్లడలు గన్గొనుచు దైన్యమున
నెలుఁగు రాలుపడంగ నింపు దొఱంగఁ
గోలని సైకతభూమి గొబ్బున వ్రాలె.

వ. ఈప్రకారంబునఁ గాసార తీరంబునఁ దోరంబగు పుప్పొ
టీరంపు పుప్పొడి దుమారంపు నిప్పుకుప్పలపైఁ బొరలుచు
మరులునం దెరలుచుండె నప్పు డెటువలెను.

జంపె:—

చిఱుత మారుతముచేఁ జెదరు విరిపుప్పొడులు
కఱకంఠునకు మిణుంగురులవలె నుండెన్. 1

మెట్ట కెందొగల జిగి చుట్టు గనుపట్ట విను
జుట్టుదొరకు దవాగ్నిఁ జూచి నటు లుండెన్. 2

బాళి గులుకు మరాళపాళి మధుపాళికలు
శూలికే శూలములు చూపిన ట్లుండెన్. 3

వ. అప్పుడు పార్వతీపతి కొలంకువంక చూచి భ్రమసెనట యెటు వలెను.

ఏకతాళి:—

తరుణి గుబ్బ లని తామర మొగ్గల
దొరసి కానియెడఁ దుందుడు కొందున్. 1

కలికి కన్ను లని కలువలఁ గని ప్రియ
మొలసి కానియెడ నుసురుసు రనును. 2

సుదతి కంఠ మను సొక్కున శంఖము
గదిసి కానియెడఁ గళవళ పడును. 3

వ. ఈచందంబున డెందంబునఁ గుంది తన్ను నలఁత నొందించు మందానిల శరచ్చంద్ర కందర్పులఁ గూర్చి యే మను చున్నాఁడు.

త్రిపుట:—

వలను నీకు మఱి (?) మేతగొను చిలు
వలను వలయముఁ జేసి మెట్టితి
తలఁప వామేలైన మందానిలమ నీవు. 1

గరిమ నాపేరిచ్చి దోషా
కరుఁడ వగు నిను మాళి నునిచిన
కరుణ దలఁచఁగ నేచెదవు నీ.... 2

జగము కామవశుండు శివుఁ డన
సగము దేహము మగువ కిచ్చిన
తగులు దలఁచఁగ నగడుఃపఱచగ దగునె మదన. 3

గీ. అనుచు లేచుచుఁ బొరలుచు హా యటంచు
నట్టి బయ లాలకింపుచు నదిగొ కాంత
యని భ్రమసి బయలు కౌఁగిట నానుకొనుచు
నువిద లేకున్న నడలొందు చుండె నపుడు.

కులుచజంపె:—

విరహాభావమున నిట్టుల - కొలనికడ
వివశుఁడై శివుఁడుండఁగ
హరిమాయ యావేళను - చిలుకయై
యరుదెంచి యిటు లనియెను.

మధ్యమావతి:—

ఈలాగు చింతింపకు
ఈలాగు చింతింప కిందుశేఖర యింత
తాళు పరాకు చిత్తములోన
జాలి వలదు నీకు జవరాలిఁ జూపెద. 1

మాటికి నీవింత మనఃఖేద పడఁగాను
బోఁటికి దయరాక పోదు, నావెంట న
చ్చోటికి రావే, కొంకక మరు
ఘాటికి దేవా,నీ వన్నిట మేటివి గావా. 2

మత్త చిత్తమున...గూయఁ గోయిల తల
యొత్త నియ్యదు సామి కెలఁదోఁట వలరాజు

కత్తులబోను తేటులబారు
జిత్తులుపూను, నింతటి వేఱు విత్తులలోను ॥ ఈలాగు ॥ 3

వ. అని కపటనారాయణి ప్రేరితయై వచ్చి మచ్చికమాటలాడు నచ్చిలుక కభిముఖుఁడై యలరుచు బంచముఖుం డేమను చున్నాఁడు.

పంతువరాళి:—

పల్లవి :—

కలికిఁ జూపవె యో చిలుకా - కలికిఁ జూపవె
పలుమారు ననుఁ జేరి - యలయించి పోయెను
మొలక ప్రాయపుఁ గొమ్మ - వెలయు ముద్దులగుమ్మ ॥
తళుకు బంగరుబొమ్మ - తగిన దీని
వలపునఁ జెందు - వలవంత యెంతయు
నెలఁతకుఁ దెలుప కీ - నెంజిలి దీరదు ॥ కలికి ॥

కోరినప్పుడె వచ్చు - గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చు
గారవించఁగ నేర్చు - కలయ ననుఁ
జేరి యాడిన మాట-చెవిబెట్ట దిపుడా యొ
య్యారిఁ జూపిన మ్రొక్కి-యైన వేఁడెదఁ గాని ॥ కలికి ॥

చిగురువిల్తుడు ముంచె - పొగరుతుమ్మెద మించె
దగరుకోయిల పొంచె - దాళనని
దిగులొందఁగా మరుని - తేజివైనఁ గాని
యగడుసేయక ప్రేమ - నాదరించితి వింతె ॥ కలికి ॥

వ. అని ప్రియంబులు చెప్పి యచ్చిలుకపలనఁ జెలువ యున్న యన్నెల వెఱఁగి తహతహ దొఱఁగి యుత్సాహ తరంగి

తాంతరంగుఁడై కురంగకరుండు కురంగటి పొద రింటిలో
న మెలుంగుఁ బోఁడిఁ గనుంగొనె నట యెటువలెను.

త్రిపుట:—

పైఁట దొలఁగ బటాకబయు లగు
బటువు గుబ్బలమీఁదఁ జొక్కల
పాటిదై ముత్యాల సరములు నీటుగులుకన్. 1

కమ్మకప్పురతావి వీడెము
కావి నినుమడి గాఁగఁ గ్రొంజిగి
కమ్మగొని కెమ్మోవి కెం జిగు రెమ్మె మీఱన్. 2

లీల సురత క్రీడ కున్ముఖు
రాలివలె విరికేయ్య నలరెడు
బాలఁ గనుఁగొని బాళి నలయఁగ శూలపాణి. 3

అష్టకము:—

కదియ వచ్చిన మేని కాకను
గ్రమ్మి పూఁబొద వాడఁగాఁ
గొదమ తుమ్మెద లూర్పు సెగలని
కూడకూడని పాడఁగాఁ
బదరు మదనుని తూపు లాయము
పట్ల పలుమరు గాడఁగా
ముదిత ముంపరి కరిగె శంభుఁడు
మొనసి ముచ్చట లాడఁగా.

క. ఈలాగునఁ దనుఁ గదిసిన
కైలాస నివాసుఁ జూచి గ్రక్కున పైఁటన్

బాలిండ్లఁ గప్పుకొంచును
లీలావతి త త్తరమున లేచి నిలిచినన్.

వ. కట్టిడి తనంబున న ష్మగువ తను వెతలంబెట్టి నందులం బుట్టు వెట్టనంబు(?) గనుపట్టు దిట్టతనంబుతో శివుఁ డే మను చున్నాఁడు.

ఆ. కొమ్మ లేవ నేల కూర్చుండు కూర్చుండు
మెచ్చవచ్చు బాల మేలుమేలు
చాన నీదుపలుకు సత్యంబుసత్యంబు
సకియ వినయ మింత చాలుఁజాలు.

వ. అనిన మందహాసంబుతో న య్యిందువదన యే మను చున్నది.

ఉ త్తర ప్ర త్యు త్తర పదము:—

నీవంటి దేవర వచ్చిన తఱి నిటు లేవ కుంకుదురె రుద్రా
దేవుఁడ నని నను నీవెఱఁగితి వఁటె యీ వెత నేతువె బాలా. 1
ఏవెతలను జేయను నీవు నన్నెఱుఁగక బడలెదు రుద్రా
ఈ వనమున నీ విటువలె డాఁగిన నెవ్వఁ డెఱుఁగునె బాలా. 2
డాఁగిన దానను గా నేనెప్పటి దారినె యుంటిర రుద్రా
ఏగతిఁ దాళితి వీ విరహామునను వేగుచు నుండఁగ బాలా. 3
కాఁ గలిగిన కార్యమునకుఁ దాళక కడు తొరపడుదురె రుద్రా
నేఁ గన నెక్కడ నెలఁతల కిటువలె నిలుకడ భావము బాలా. 4
చెలువలలో నను జతచేసిన నేఁ జిక్కుదు నటరా రుద్రా
చెలిమి మీఱ నిఁక జిక్కఁగ నిలువదె జీవము వినవే బాలా. 5
చల పోరామిక లేటికి యరవిరి శయ్యకు రారా రుద్రా
బళి! యిటులైతే బ్రతికితి నాయొడిపైఁ గూర్చుండవె బాలా. 6

ఔరౌరా! నీ వెంతటి బలు కక్కూరితిగాఁడవు రుద్రా
సారెకు మాటల జాగుసేయ కిఁక చేరిక గావే బాలా. 7

వ. అని మఱియు నేమను చున్నాఁడు.

జంపె:—

మది నీవెగతి యనెడి మగవాని బాసిచను
నదయభావం బెటుల నోదవెనే నీకు. 1

వెంటఁబడి వేఁడుకొను విటుఁ బాసి వనములో
నొంటి నిలఁ జిత్త మెటు లొప్పెనే నీకు. 2

గమకించి ననువంటి కాముకుని నలయించు
కొమ రెటుల దైవ మొనఁగూర్చెనే నీకు. 3

రేవగుప్తి-పదము:—

చేరరావె ముద్దు బెట్టవె యో ముద్దుగుమ్మ
వేరుసేయ నేలె విరహవేదన తాళఁజాల నే లేనె.

తాలిమి నిలుపఁ జాలనె యెంచరాని
తాపమున నికను దాళలేనె
యూరకె నన్నీలాగు నేచ నేలనె
వాలుగంటి వీరివారి వలెను జూడ కోకసారి. 1

వలరాజు పట్టపుఁ జిలుకవె నిండుతావి
వెలయు మరువంపు మొలకవె తేనె
లొలుక సొగసు మీఱె పలుకవె
పలుగంటి నామోవి నుంచి పైకొని ప్రేమఁ గులుకవె. 2

శ్రీరి రారా యని జీరవె నా తళుకుఁ జెక్కుఁ
గూరిమితో గోరఁ జీరవె మదిలోనఁ
గోరికతో నన్నె కోరవె సారె
సారెకు చలపోరక మారుని కేళిఁ గోరవె॥ చేరరావె॥

వసంతతిలకము:—

ఆలించవే మనవి - యక్కునఁ జేర్చుకోవె
వాలాయమున నిన్ - వలచివచ్చితిఁ గల్లగాదె
ఆలస్య మేలె భువ-నైక విమోహనాంగి

... ... ... ... ...

వ. అని మట్టుమీఱిన మోహంబుఁ బట్టలేక కైలాస పట్ట
భద్రుండు డాగుబ్బెతం గదిసె నప్పు డెటుపలెను.

కులుచజంపె:—

వీడె మొల పులివన్నె పట్టు, తోడు -
తోడఁ గనఁబడె లోని గుట్టు
చూడె నును కెంజడలగుంపు, శివుని -
గూడె మోహపు నిదుర మంపు. 1

అట్టె మోహినిఁ జెట్టఁ బట్టె - కినుక
పుట్ట నది కీలుజడఁ గొట్టె
కొట్టునడి నునుపైఁట ముట్టె - నింత
గొట్టెల యని కొసరి తిట్టె. 2

దిట్ట నగ్గలపుఁ దమి దొట్టె - దీని
బట్టి విడ ననుచుఁ జలపట్టె

రట్టువగ పసులు దలప్పెట్టె - నదియు
మిట్టిపడి శివు కేలుఁ దట్టె. 3

వ. అప్పు డెటువలెను.

త్రిపుట:—

చేల విడినది నేలఁ బడినది -
సిగ్గు బాయుట యెగ్గు డాయుట
నీలకంఠుఁడు దెలియఁ జాలక - బాళి మీఱె. 1

నిలువ కేఁగెడి చెలువ వెంబడి -
నిగిడి పోకుము పోకువే యని
పలుకుచును వడి నేఁగి జాతెడి - పైఁటఁ బట్టెన్. 2

కేలుఁ దట్టిన బాల గట్టిగ - కేలి పట్టుకఁ జిక్కితివె గ
య్యాళి యనుచును హాళిఁ గౌఁగిట - నలముకొనియెన్.

చ. అడుగులు నొట్రిలంగ నిటు లంగనఁ గౌఁగిట నుంచుకొన్న య
ప్పుడె తనులెల్ల జెమ్మరిలఁ బోరన జాఱిన శుక్ల మేలులై
మడుఁగులు గాల్వలై ధరణిమండలి సోఁకిన చోటు లెల్లఁ బు
త్తడియును వెండియై తగ నతండును గాంచెను బారవశ్యమున్

వ. అప్పు డెటువలెను.

త్రిపుట:—

పారవశ్యము మాని లోచన -
పంకజంబులు విచ్చినను శ్రీం
గారవన మెప్పంటి సభయై కానుపించెన్. 1

హారకుండల మకుటమణి కే-
యూరములు కట కాంగుళీయక
వారములు కనకాంబరము చెలు-వంబు గులుకన్. 2

ఇంతి రూపము మాని శ్రీహరి -
యెప్ప టట్లు సభాస్థలిని శ్రీ
కాంతతో వసియించె నవ్వు మొగంబు మెఱయన్. 3

హృదయ మన్ను నుదయాచలంబున -
నెక్కి బ్రహ్మజ్ఞాన భానుఁడు
పొదల నది హరిమాయ యని శం-భుఁడును దెలిసెన్. 4

వ. అప్పు డెటువలెను.

జంపె:—

దామోదరుని జేరి - తగు బ్రహ్మఋషులతో
తామరసభవుఁడు వే-దములచేఁ బొగడెన్. 1

కురిసె విరు లవ్వారి - మొరసె వేల్పులభేరి
సురలు గొనియాడి ర-ప్సర లాడి రపుడు. 2

స్వామి నీమాయ నె-వ్వఁడు దెలియు నని నవ్వు
మోముతో శ్రీలక్ష్మి - ముపహరిని బొగడెన్. 3

మఱఁది నెన్నివిధాల - మరులుకొల్పితి వనుచు
గిరిజ యంజలి చేసి - కీర్తనలు సలిపెన్. 4

వ. ఆ పురుషోత్తముని బహు పరివారంబులు కైవారంబులు
సేసి భారతీ ధవళాక్షి ధవళము బాడె నట్టు లెటువలెను.

ధవళము:—

జయజయ! దేవముకుందా!
జయజయ! పరమానందా!
జయజయ! హరిగోవిందా!
జయజయ! ఘనగుణబృందా!.

తామర సాయత నేత్రా!
శ్యామల కోమలగాత్రా!
శ్రీమహనీయకళత్రా!
స్వామి విచిత్రచరిత్రా!.

వ. అప్పుడు మఱియు నిట్లనియె.

క. చామరము విసరఁ గొంచును
దామోదరుఁ బొగడు కొంచుఁ దాళధ్వనితో
వేమరు నటియింపుచు నీ
ణాముని నారదుఁడు శోభనము వినిపించెన్.

శోభనము:—

బంటు పంతము చెల్లె - భూమి రూపమున ము
క్కంటిఁ జిక్కుల నిడిన - కమలనేత్రునకు ॥ శోభనమె ॥ 1
బాలుఁ డాడిన యట్టి - పలుకు చేకూర్చుటకు
వేళమై కంబమున - వెడలు నరహరికి ॥ శోభనమె ॥ 2
అటువంటి దిటువంటి - దనరాని మాయచే
ఘటియింప రానిదే - ఘటియించు హరికి ॥ శోభనమె ॥ 2

వ. అప్పుడు పౌలోమి మొదలైన దిక్పాల బాలికలు హరికి మంగళహారతి యెత్తుచు మంగళము పాడి రంట యెటువలెను.

మంగళము:—

ఇందు వదనునకు - నిభ వదనునకును
మంబరధరునకు - మంగళం. 1

కుందరదనునకు - గుణనిధి కాశ్రిత
మందారునకును - మంగళం. 2

మాయల సామికి మంగళం దయ
మముఁ బ్రోచు ఘనునకు మంగళం. 3

వ. ఆ సమయంబున నిర్మల స్వాంతుఁడై గౌరీకాంతుఁడు వీడిన జటాకలాపంబులు చక్కఁ బెట్టుకొని, యూడిన గజచర్మ వ్యాఘ్రాజినమ్ములు సవరించి కట్టుకొని, తన యోగప్రభావంబున లజ్జాపవాదశంకాతంకంబులు లేనివాఁడై బ్రహ్మేంద్రాది బృందారక బృంద సంస్తూయమానుఁడై ముకుందుని జేరి ముకుళిత కరకమలుండై యేమని స్తుతియించు చున్నాఁడు.

శ్లో. మాయాద్యై తరవాణి విశ్వవిబుధ శ్రేణీశ మనోవాక్పథా
దూరాద్యై వినుతిం కిమస్తి హి మహత్తే దేవ లక్ష్మీపతే,
జ్ఞాతుం తన్మహిమాన మేత్యపతితో భ్రాంతో హా మత్యాగసా
క్షంతుం మే ర్హసి కర్మశర్మకరణే దేవేషు రూఢో భవ.

వ. అనిన ముకుందుండు ఏమని యూరడింపు చున్నాఁడు.

జంపె:—

నా మాయ ద్రోయు - టెంత ప్రయత్న మీ వింత
యేమొ యని కనుఁగొంటి - వింతెకా కభవ! 1
ఏవంతఁ జెంప నీ - కేల యొకరికి భ్రమ
నీ వంత యజ్ఞుఁడవె - నిఖిల లోకేశ! 2
మది నెంచ మనలోన - మనకు భేదము గలదె
ఇది యేమి యుపచార - మిపుడు పరమేశ! 3
దేవతలలో మహాదేవుఁ డను విఖ్యాతి
నీవె దాల్చుట లోక - మెఱుఁగదె పురారి! 4

వ. అని చెప్పి పరీక్షిన్నరేంద్రునితో శుకయోగి యే మను
చున్నాఁడు.

జంపె:—

హరియంత బ్రహ్మాదే - వాది దివిజులఁ బనిచి
పరమ సౌఖ్యము లొందెఁ - బద్మతోఁ గూడి. 1
మనుజేంద్ర యీ విష్ణు - మాయావిలాసంబు
వినినఁ జదివిన లిఖిం-చినఁ బఠించినను. 2
జనులకుఁ జిరాయువును - సంతతారోగ్యము స
ఘనత నైశ్వర్యములు - గలుగు హరి కరుణన్. 3
అటు గాన నీవును గృ - తార్థుండవైతి వన
జటినిఁ బూజించి నృప-చంద్రుండు నలరెన్. 4

ద్వి:—

అని దయాధిక గుణోదారుని పే
ర్మనుజేంద్ర సేనా నిబారుని సేవ

అతుల కౌస్తుభరత్నహారుని పేర
యతి మనఃకమలవిహారుని పేర
సరస గుణోపాంగచారుని పేర
సురుచిర నవనీతచోరుని పేర
తత వక్షు పేరఁ బద్మదళాక్షు పేర
నత పక్షు పేర దైన్యవిపక్షు పేర
ఖగయాయి పేర లోకవిధాయి పేర
నగధారి పేర పన్నగహారి పేర
వనమాలి పేర పావనకేళి పేర
ఘనదేహు పేర శ్రీకర బాహు పేర
క్రతుపాలు పేర భక్తకృపాళు పేర
ప్రతిలేని మదనగోపాలుని పేర
సంకితంబుగఁ దత్కటాక్ష ప్రభావ
సంకలిత కవిత్వ సాహిత్యశాలి
కంకంటి యప్పనాగ్రణి కుమారుండు
పంకజలోచన పంచబాణుండు
పాపరా జొనరించె బహుపదార్థముల
వ్యాపించి విష్ణుమాయావిలాసంబు
భూమిని తిలకించి బుధులెల్లఁ బొగడ
ఆమిత్రతారాబ్జమై విభాసిల్ల.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1955

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | అచ్చు | |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము ... | 0 | 4 |
| డిటో సటీక ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, (నిఘంటుత్రయము) కాలికో ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో ... | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు ... | 15 | 0 |
| 7 సంపుటములు ... | 18 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు ... | 6 | 0 |
| కవికంఠోక్తి ... | 0 | 4 |
| కవిగజాంకుశము ... | 0 | 4 |
| కవిజనాశ్రయము ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి ... | 1 | 4 |
| కవిరాజమనోరంజనము ... | 1 | 4 |
| కవిజనరంజనము ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము ... | 4 | 0 |
| ,, లఘుటీకానుక్రమణికతో ... | 5 | 8 |
| కృష్ణదండకము ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము ... | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథునిది ... | 3 | 8 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయకృతము ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము ... | 5 | 0 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 12 |
| గయోపాఖ్యానము, రామసామాత్యునిది ... | 0 | 12 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 4 |
| గణికాగుణప్రవర్తనతారావళి ... | 0 | 4 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము, అత్తలూరి పాపకవి ... | 1 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) ... | 2 | 0 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 3 |
| దశావతారచరిత్ర, ధరణిదేవుల రామయమంత్రి ... | 4 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) ... | 0 | 8 |
| ధనాభిరామము, నూరనకృతము ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకారసంగ్రహము) | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము ... | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మిక్కిలి మల్లికార్జునకవి ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.